# పురమందిరం

(నాటకము)

# PURAMANDIRAM

గ్రంథకర్త:

విద్వాన్ చిట్టా రామకృష్ణరావు ఎం. ఏ., బి. ఇడి.,

అధ్యాపకుఁడు,

[illegible] సెకండరీ స్కూలు,

[illegible] పట్టణము.



ప్రథమ ముద్రణము : 500 ప్రతులు.

1958.

 [మూల్యము రు 1-0-0.

# —: ప్రార్థన :—

(ఎంతఘాటు ప్రేమయో......పలె)

ప॥ దేవ దేవ బ్రోవుమా ! దీనపాల కావుమా! ॥దే॥

చ॥ సన్నుతించువారము మా కళలు మెఱయగా

మా మనసు మురియగా ॥దే॥

2. చెంతజేరి ప్రేమతో సంతసంబు మా కిడుమా! ॥దే॥

3. కన్నులతో కనినంతనే తనువు వెలయదే

మా మనసు విరియదే ॥దే॥

4. మా మాటలు మా పాటలు మా నటనాసుధతో

రసికులలో రతనాలకు విందుసేయగా ॥దే॥

5. ఓ సారధి ! ఓ సన్నుత ! ఓసుకళాశ్రయమా !

ప్రియమారగ మా నటనను పెంపుసేయుగా ॥దే॥

# పీఠిక.

నేనీ నాటకమును క్రీ. శ. 1950 లో రచించితిని. ఇది 1951 లో మా పాఠశాల విద్యార్థులచే ప్రదర్శింపబడెను. కాని వెంటనే ముద్రణ భాగ్యమునకు నోచుకొనలేదు. అది యిప్పటికి కలిగినది.

దీనిని రచించుటలో ప్రజాసమూహమునందు గ్రామ సేవాభిలాష, కార్యాచరణ నైపుణ్యము, అకుంఠిత కార్యశూరత్వము, కళాభిమానము మున్నగు నుదాత్తాశయముల గలిగించుటయే నా ప్రధానోద్దేశము. ఇందలి యితివృత్తము కేవలము సాంఘికమగుటచే సంభాషణలందు వ్యావహారిక భాషను వాడితిని. పద్యములు చాల తక్కువగ చేర్చితిని. ప్రజాభిరుచిని బట్టి పాటలను సినిమాపాటల కనుకరణముగ వ్రాసితిని. ఈ ట్యూనులు కొంతకాలమునకు మరుగుపడి పోవచ్చును. అప్పుడు ప్రదర్శకులు కాలానుగుణ్యములగు ట్యూనులలో క్రొత్తపాటలు చేర్చుకొనవచ్చును. అట్లుకాక కేవలము గద్యనాటకమే కావలెనన్నచో పాటలు పద్యములు విడచి వాని భావములనుమాత్రము గద్యములో చేర్చుకొనవచ్చును.

మొట్టమొదట యీ నాటకము ప్రదర్శనందు తోడ్పడిన మా పాఠశాలాధికారులకును, సహోపాధ్యాయులకును నా కృతజ్ఞతాభివందనములు, విద్యార్థులకు నా హృదయపూర్వకాశీస్సులు. దీనిని త్వరితముగ ముద్రించి యిచ్చి నా యక్కఱదీర్చిన 'గుడ్ విల్ ప్రింటర్సు' యజమానులకు నా ధన్యవాదములు.

మచిలీపట్టణము,
29—1—1958.

ఇట్లు
చిట్టా రామకృష్ణరావు,

# : పాత్రలు :

పురుషులు :—

విశ్వనాథరావు — న్యాయవాది, కథానాయకుడు
భుజంగరావు — పురములోని పంచాయతీ సభ్యుడు.

మోహన్
గణేశ్
గోపాల్
ప్రకాశ్
సుందర్
} కళాశాల విద్యార్థులు

శివయ్య — పుష్పలత తండ్రి
కేశవయ్య — కళావతి తండ్రి

బొజ్జయ్య
చిక్కప్ప
} రైతులు

శివరామప్రసాద్ — నాట్యకళాసార్వభౌముడు
కోటయ్య — వడ్డీ వ్యాపారస్థుడు
శంకర్ — కోటయ్య కుమారుడు
(వీరుకాక మంత్రి, కలెక్టరు, శ్యామారావు, శ్రీహరిరావు మున్నగువారు.)

స్త్రీలు :—

1. పుష్పలత — ప్రఖ్యాత నటీమణి
2. కళావతి — నూతన నటీమణి

శ్రీరస్తు.

# —: పురమందిరం :—

## మొదటి రంగము

[ప్రకాశ్ గృహములో చదువుకొనుగది. అది మంచి పటములతోను, పుష్పపాత్రలతోను, నాజూకుగ అలంకరింపబడియుండును. ప్రకాశ్ పైజామా, జుబ్బా వేసికొనును. అతని స్నేహితుడు మోహన్ బుషుకోటు, ట్రౌజరు ధరించి ఒకప్రక్క కుర్చీలో కూర్చుండును. ప్రకాశ్ ప్రేక్షకుల కెదురుగ నున్న ఒక కుర్చీలో కూర్చుండును. ఇద్దరికెదురుగ ఒక బల్లయుండును. ఇరువురు యేవో పత్రికలు చదువుచుందురు. తెరలేచును]

ప్రకాశ్:— (విసుగుచూపు ముఖముతో) ఈ యెండాకాలం సెలవలువస్తే నాకు మహా విసుగుగా ఉంటుందిరా మోహన్. నిజంగా యీ సెలవలకు నేను మా ఊరికి యెందుకువచ్చానా అనిపిస్తుంది. నీకూ అల్లాగే ఉంటుందా?

మోహన్:— (తలయెత్తి) ఎందుకా విసుగు? ఎండ ఎక్కువనా? లేక పని తక్కువనా?

ప్రకాశ్:— ఎండయెక్కువని కాదు. పనితక్కువనే. కాని కాలేజీలో ఉన్నప్పుడు ఆపనితోను యీపనితోను కాలం విమానంలో పోతూఉంటుంది. కాని యిక్కడికివస్తే ఆదేకాలం తాబేటినడకతో పోటీచేస్తూ, యెక్కడాలేని చికాకు పుట్టిస్తుంది. ఇక్కడ యెంతసేపని యీ పత్రికలతోను, పుస్తకాలతోను ముచ్చటిస్తూఉంటాం? ఎంతసేపని టెన్నిస్ ఆడుతూఉంటాం?

మోహన్:- అవునవును. నాకూ అల్లాగే అనిపిస్తూ ఉంటుంది. కాని యేమిచేయగలం? ఎండాకాలంలో యిక్కడికిరాకుండా యిక్కడే ఉంటామంటే ఒప్పుకుంటారా మీవాళ్లూ మా వాళ్లూ? ఏదోవిధంగా యీ మూడుసెలలు యిక్కడ వెళ్లబుచ్చేది; మళ్లా కాలేజికిపోయేది. వచ్చే యేడాదిలో నీకూ నాకూ డిగ్రీ పూర్తవుతుంది గా. ఇంక తరువాత కథ తరువాత ఉండనే ఉంది.

ప్రకాశ్:- ఏమిటి?

మోహన్:- ఉద్యోగం.

ప్రకాశ్:- ఉద్యోగమా!

మోహన్:- ఊఁ, 'ఉద్యోగం ఉద్యోగమంటే ఊరికే వస్తుందా? అన్నాడు షేక్స్పియర్ మహాశయుడు.

ప్రకాశ్:- షేక్స్పియర్ మహాశయుడే! అయితే నీవు షేక్స్పియర్ మహాశయుణ్ణి బలేచదివావన్నమాట! అందుకనే కొటేషన్లు ఉదాహరించేసి పొంగి పొంగి పొర్లివస్తున్నాయ్. అవునుగాని, ఉద్యోగం ఉద్యోగమంటే జ్ఞాపకమొచ్చింది. మొన్న వెళ్లాం మాతావా 'సదుద్యోగి' అనే చిత్రానికి. అందులో ఆ నాయకుడు పాడాడే. ఆపాటపాడరా ఒకసారి వినాలి. అది చాలా బాగా ఉంది.

మోహన్:- అదా? ఏమంత బాగుందిరా?

ప్రకాశ్:- దానికేమిరా? మొదటిరకంపాట్లు,

మోహన్:- సరే అయితే, చెప్పులు సిక్కించితిని. అటువంటి మొదటిరకంపాటను నీవంటి మొదటిరకంవాడే మెచ్చుకోవాలి.

మోహన్:- (గేయము)

(సాహిత్య - సాహితీ సమితి)

1. ధీరుడా చేయుమా పౌరుడా ॥ ధీ ॥

2. చేయుము శ్రేయస్కర కార్యములు
పురముకొఱకు నీవనిమఱక
మరువక నిరతము ధీరుడవై
పౌరకోటి కృతులే పురము మహాలంకారములు ॥ ధీ ॥

3. యువకులసేవే జీవిత మధురం
ఫలమే సేవా మాధుర్యం
జీవితస్వర్గం వీరులకే
ఆటలు పాటలు ధీరులకే ॥ ధీ ॥

4. పురము సుఖము సౌభాగ్యకళలలో
సేవామార్గపు వెన్నెలలో
ఆడేఆటలు పాడేపాటలు
వడి వడి యువకుల రక్తములో
వడి వడి యువకుల కలలో ॥ ధీ ॥

[ఈ పాట జరుగుచుండగా ప్రకాశ్ మునివేళ్లతో మెల్లగా ఎదుటిబల్లపై తాళము వేయుచుండును.]

ప్రకాశ్:- ఒగేయ్ మోహన్, నీపాటను, దానిలోని దివ్య ప్రబోధమును విన్నతరువాత, నాకిప్పుడొక మంచి ఊహ తట్టుతోందిరా.

మోహన్:- (చిఱునవ్వుతో) ఏమిటది? వన్ను సినిమాలలో చేర్పించాలనా ?

ప్రకాశ్:- (చిరునవ్వుతో) కాదు కాదు, చెపుతావిను.

[అంతలో గణేశ్ ప్రవేశించును. అతడు కాలేజీ విద్యార్థి వలెనే ఒక ఫాంట్సు, లోపలకుచెక్కిన షర్టు వేసికొని యుండును.]

గణేశ్:- (ప్రవేశించుచు) హాలో ప్రకాశ్! ఓహో, మోహన్ కూడా యిక్కడే ఉన్నాడే! అయితే యింకాయేం? మంచి అవకాశమన్నమాట!

మోహన్:- దేనికి ?

గణేశ్:- నిక్కేమిటి? (కూర్చుండును) చతుర్ముఖపారాయణానికి.

ప్రకాశ్:- అవునుగాని, గణేశ్, ఆపారాయణం తరువాత చూసుకోవచ్చునుగాని, నేనిప్పుడొకమాట చెపుతాను మరి యిద్దరు వింటారా ?

గణేశ్:- ఏమిటది ?

ప్రకాశ్:- వింటానంటే చెపుతా.

గణేశ్ :- వినకేం? నిస్సంకోచంగానంటూ చెవులుండగా వింటానికి మాకేంకష్టం?

ప్రకాశ్ :- అయితే వినండి. ఏమిటంటే, మన మీ యెండా కాలపు సెలవులలో ఒక మంచి డ్రామా వెయ్యాలి.

గణేశ్ :- ఎక్కడ?

ప్రకాశ్ :- మనఊళ్లోనే. ఎక్కడో కాలేజిలోవేస్తేచాలదు.

గణేశ్ :- బాగానేఉంది? వెనకడికి యెవడో అన్నాడటలే రోలున్నది, వేలున్నది, యింక గారెలు చేసుకుందామని. అసలు యిక్కడ నాటకంవేయటానికి తగినంతమంది నటకాగ్రేసరులేరి? అదీకాక నీ నాటకం నా నాటకం యెవరు చూస్తారు? నాటకం వెయ్యటమంటే రోజుకు మూడుసార్లు కాఫీ త్రాగటమా?

ప్రకాశ్ :- అదికాదోయ్; మనకు తెలిసినవాళ్లే డజనుమంది కాలేజీవాళ్లు ఉన్నారాలేదా?

గణేశ్ :- ఉన్నారు. ఏమిలాభం? ఒక్కడికైనా సరిగా ఒక్క రాగంకూడ రాదు, నీకు మోహన్‌కు యింకా ఒకళ్లిద్దరికితప్ప.

ప్రకాశ్ :- అదికాదు, నాటకం వెయ్యాలంటే అందరూ పాడేవాళ్లేఉండాలా? కొందరు బాగా పాడేవాళ్లుంటారు, కొందరు బాగా నటించేవాళ్లుంటారు. అందరు పాడవలసినంత అవసరమేముంటుంది?

గణేశ్ :- నీవు నూటొకటి చెప్పు, వేయి చెప్పు, నాకు మనఊళ్లో నాటకం వేయటానికి యేమాత్రము యిష్టంలేదు. నాకెవ్వరు మనఊళ్లో మెడలిరవనక్కరలేదు.

ప్రకాశ్ :- మేముమాత్రం మెడల్సుకోసరమా యీ నాటకం వేసేది? మనం యీఊరికిచెందినవాళ్లమేనా? ఇక్కడే పుట్టి పెరిగినవాళ్లమేనా? అందువల్ల మనశక్తికొలది మనఊరికి ఏదోకొంత ఉపకారం చేయావలెనని కోరికకలిగింది. మనం పెద్దవాళ్లమైతే యీమాత్రం చేయగలమోలేదో ధైర్యంగా చెప్పగలమా? అప్పటి మన పరిస్థితు లెట్లావుంటాయో! అందువల్ల కనీసం యీమాటకైనా ఒప్పుకుంటావా నీవు? మన గ్రామానికే ఉపకారం చేయుడముగా

గణేశ్ :- ఆc, మనం యిప్పుడు ఉపకారం చేయలేకనే ఊళ్లో వాళ్లంతా అనుకుంటున్నారు! మనకెందుకురా యీ లేనిపోని గొడవంతా, హాయిగాతిని ఆనందంగా పేక ఆడుకోక? అందులోనూ గ్రామమంటే నాకు అసలే తలనొప్పి.

ప్రకాశ్ :- సరే, యింక నీతో వాదించేదేముంది? నీవు వీనటాని కిష్టంలేకపోతే పోనీ మోహన్‌నైనా వినని య్యి.

గణేశ్ :- అయితే, నీవిప్పుడు యీగొడవ పెట్టుకుంటానంటావు గాని పేక ఆడవన్నమాట. అంతేనా?

ప్రకాశ్ :- ఇప్పుడుకాదులే, కొంచెంసేపుండి ఆడుకుందాం.

గణేశ్ :- సరే, అయితే కానియ్యండి మీ ఆలోచన; నేనల్లా బజారుకు వెళ్ళివస్తా. మీ నాటకం అయినప్పుడు చూద్దాములే.

ప్రకాశ్ :- గణేశ్, నేను చెపుతున్నాను విను, నీవు నిద్రాహారాలైనా లెక్కచేయకుండా యిరవై నాలుగుగంటలు ఒకటే పిచ్చిగా ఆపేకాట సంద్రములోపడి కొట్టుకుంటున్నావు. చెడిపోతావు జాగ్రత్త! నేను నిజమైన స్నేహభావంతో చెపుతున్నాను విను.

గణేశ్ :- సరేలేనూ, బలేచెప్పావోయ్ సలహా! నీ అమూల్యమైన సలహాను యిప్పుడెవ్వరు అడుగలేదు. నీగొడవ నీవు చూసుకోవాలి.

ప్రకాశ్ :- అయితే నీవిప్పుడెక్కడికి వెళతావు? ఇక్కడే ఉండి నేను చెప్పేదైనా కాస్తవిను.

గణేశ్ :- వద్దులే, యీపిచ్చిపెడదంతా నాకెందుకు? హాయిగా అల్లా బజారుకు వెళ్ళివస్తా, మీ గ్రామసేవను మీరు కానియ్యండి. గ్రామదేవతలు! (అని కోపముతో చూచుచు నిష్క్రమించును.)

ప్రకాశ్ :- (లేచి బల్లముందుకువచ్చి గణేశ్ పోయినదిక్కు చూచి మరల మోహన్‌తో) వీడు పట్టి పేకపిచ్చిలోపడి కొట్టుకొంటున్నాడు. అందులోను డబ్బులేందే ఆడడు. చెడిపోతావురాబాబు, దాన్ని వదలరాఅంటేకొంచెము వినకుండా ఉన్నాడు. పైగా మనమంటేను మనపనులంటేను

వీనికి సట్నానంత అసూయ. కాబట్టి మనం వీని మాట లంతిగా లెక్కచేయక, మన అభిప్రాయాన్ని యెల్లా గైనాసరే ఆచరణలో పెట్టితీరాలి. వీనికి గణేశ్ అని పేరున్నందుకు తరచుగా మనపనులకు వినాయకుడుగానే కనబడుతున్నాడు.

మోహన్:- (చిఱునవ్వుతో లేచి ముందుకువచ్చి వాని భుజముపై చేయివైచి) ఆఁ, వాడేమిచేయగలడుగాని, నీవు ధైర్యంగా యీనాటక ప్రదర్శనానికి పూనుకో. దానిని సాధించే మార్గాలన్నీ నేను చెప్తూ, అది నెగ్గేటట్లుచేస్తాను.

ప్రకాశ్:- సరే అయితే; నీవు ధైర్యముచెప్తేచాలు. నేను మాత్రం తప్పక ముందుకువచ్చి తగినపనులన్నీ చేయించడానికి సిద్ధపడతాను. (తెరవంకచూచి) అదుగో, మా నాన్న నాకోసం యెదురుచూస్తున్నట్లున్నాడు, వెళ్లివస్తాను.

మోహన్:- సరే, నేనుకూడా యింటికివెళ్లి మళ్లీ సాయంత్రం వచ్చి కలుస్తాను. అంతా సవిస్తరంగా మాట్లాడుకుందాం. (చెరియొకవైపు నిష్క్రమింతురు. తెరపడును.)



# రెండవరంగము

[గోపాల్ యిల్లు, ఒకగదిలో గోపాల్, గణేశ్‌లు చెస్ ఆడుతూ ఉంటారు. తెరలేచును.]

గణేశ్ :- (యోచించి ఒకటిజరిపి) ఆఁ, అదిఎత్తు.

గోపాల్ :- (యోచించి మరొకటిజరిపి) ఆఁ, అది యెత్తుకు పై యెత్తు.

గణేశ్ :- (యోచించి వేరొకటిజరిపి) ఆఁ, ఇదీ పై యెత్తుకు పై పై యెత్తు.

గోపాల్ :- (యోచించుచు) (గేయము)

(ఏక్ దఫాకీ షేరంహాన్ . . . . వలె)

1. ఓహో బలేతమాషాలే బహాదూర్ బలేతమాషాలే
   బలేబల్ ఆటను ఆడితివే బలేబల్ పాటను పాడితివే

గణేశ్ :-

2. ఇక ఆడెదమాతువుగా గమక్ కనుమోయి చమక్ కనుమోయీ
   ఇదిచూచిన నీకే ఆట మజా తెలియగాలీ
   నీగుట్లన్నీ దాటాలి మరి నీయేనుగులేమగులే
   బలేబల్ పాటను పాడితివే బలేబల్ ఆటను ఆడితివే.

గోపాల్ :-

3. నీ ఎత్తుకు యెత్తువేసెదలే వహ్వారే వహ్వారే

గణేశ్ :- నీయెత్తులు తెలియనివాడను కానోయ్ నేనే కానోయీ ॥

గోపాల్ :—

4. అయితే కాచుకో గుఱ్ఱా లెగురవలె యేనుగులూఅంతే
బలేబల్ పాటల నాడితివే ॥
బలేబల్ ఆటను ఆడితివే ॥ ఒ ॥

గణేశ్ :— ఇదుగో, గోపాల్, నీవు పాటలో మజా వినిపిస్తే, నేను ఆటలో మజా తినిపిస్తా. సరేనా? (అని ఒకటిజరుపును)

గోపాల్ :— అవునుగాని, గణేశ్, పాట అంటే జ్ఞాపకంవచ్చింది. వాళ్ళ డ్రామా విషయం తరువాత యేమి జరిగిందో చెప్పావు కావే.

గణేశ్ :— ఏం? నీవుకూడా వేషంవేసి వెలిగించాలని కోరికగా ఉందా?

గోపాల్ :— లేదురా; అందుకుకాదు. తరువాత ఏమిజరిగిందో ఊరికే తెలుసుకుందామని అడుగుతున్నానే కాని మరేమీ కాదు. నాకు ఏదోవిధంగా పాట వచ్చునేగాని నటించ టానికి యిష్టంలేదు.

గణేశ్ :— ప్రకాశ్ యెక్కడరా! అప్పుడే అంతా అయిపోయి నట్లే మాట్లాడుతున్నాడు. ఎక్కడైనా యిల్లలకటంతోటే పండుగ అవుతుందా?

గోపాల్ :— ఏమంటున్నాడు?

గణేశ్ :— వాళ్ళకి హార్మోనియము తబలా వగైరాలు వాయిం చటానికి మన కాలేజీ విద్యార్థులే ఉన్నారట! నాటకం వెయ్యటానికి ఊర్లో హాలున్నదట! ఇంక మాకేం తక్కు వని గప్పాలు కొడుతున్నాడు.

గోపాల్ :— అది సినిమాహాల్ గా; నీక్కెల్లా పనికొస్తుంది?
గణేశ్ :— రామాపురంలో కర్టెన్లు యిచ్చే రామయ్య ఉన్నాడు కాదు? అవితెచ్చి ఆ సినిమాహాలునే నాటకంహాలుగా తయారు చేస్తారట!
గోపాల్ :— అయితే ఆ హాలుకు ఒకరాత్రికి అద్దె యెంతో తెలుసునా? ఇస్తాడా అంతఅద్దె? అసలు నాటకానికి వచ్చే ఆదాయం యెంత?
గణేశ్ : అల్లా కాదట! హాలుకూడా ఉచితంగా వచ్చేటట్లే యేర్పాటు చేసుకుంటారట!
గోపాల్ :— ఊఁ! వీళ్లుపోయి అడిగితే యిస్తారా పాపం!
గణేశ్ :— (చిఱునవ్వుతో) వాళ్ళ పలుకుబడి యెంత ఉందో వాళ్ళకూ తెలుసు.అందుకనే ప్రకాశ్ నాయనను ఉపయోగించుకొని గ్రామసేవకని ఊరిలో పెద్దవాళ్ళసమావేశం ఒకటి యేర్పాటు చేయబోతున్నారట! దాంట్లో లాయర్లు,డాక్టర్లు, ఉద్యోగస్థులు వగైరాలతో ఒక కార్యనిర్వాహక సంఘాన్ని యేర్పాటు చేస్తారట. ప్రకాశ్ నాయన ఆ నిర్వాహక సంఘానికి కార్యదర్శిగా ఉండటానికి, ఆనాటకానికి దర్శకుడుగా ఉండటానికి ఒప్పుకున్నాడట. ఎందుకంటే ఆయనకు నాట్యకళ అంటేను, సంఘసేవ అంటేను చాలా యిష్టం. ఒకప్పుడు ఆయన నాట్యకళా ప్రపూర్ణ బళ్లారి రాఘవాచారిగారితో కూడ చేరి నాటకాలు వేసినవాడు. ఇంక అటువంటివాళ్లంతా కలసి పూనుకుంటే యేపని చేయలేమని కోతలు కోస్తున్నాడు ప్రకాశ్.

గోపాల్ — ఇదంతా ఆ మోహన్ ఉపాయమే అయిఉంటుంది. ప్రకాశ్‌కి వట్టి ఉత్సాహమేగాని ఆలోచన అంతగా లేదు.

గణేశ్ :- సరే, చూస్తాంగా త్వరలోనే వీళ్ళ ప్రతాపం. మహా సంఘసేవా పరాయణులు !

గోపాల్ :- అయితే, అసలు సంగతి అడగటం మరచిపోయాను. ఆ నాటకంమీద వచ్చిన ఆదాయం దేని కుపయోగిస్తారట ?

గణేశ్ :- మనఊరికి యిదివరకున్న పురమందిరం పడిపోయింది కాదు ? అందువల్ల దానిని మరల మరమ్మతు చేయిస్తారట. మనఊరికి మంచి పురమందిరం లేకపోవటం ఒక గొప్ప లోటుట !

గోపాల్ :- పెద్దకోరికేనే ! పురమందిరం మరమ్మతంటే ఊరికే ఉందా ? ఈ రోజులలో కనీసం 20 వేల రూపాయలైనా లేందే అది మరల యథారూపానికి వచ్చి అందరికి ఉపయోగపడే రీతిగా తయారవుతుందా ? అందులోనూ ఖర్చులన్నీ పోను వీరికి నికరంగా యెంత ఆదాయం వస్తుంది ? 20 వేలు వసూలు కావటానికి వీళ్ళు సినిమా తారలా లేక నట చక్రవర్తులా ?

గణేశ్ :- అవే మన ప్రకాశ్‌గారి అపూర్వ అత్యద్భుత అతి వికారపు ఊహాపోహాలు. కాలేజీలో రెండుకప్పులు సంపాయించాము కదా అని యిక్కడకూడ తనవేషాన్ని చూడటానికి అందరు విరగ బడతారనుకుంటున్నాడు ! ఈ నాటకమంటే కాలేజీలో బీద విద్యార్థినిధికి నాటకం వేసినంత సులభమనుకుంటున్నాడు.

గోపాల్ :- బాగానేవుంది! అసలు రాబడి చూసుకోకుండా యెన్ని సన్నాహాలు చేస్తే యేమిలాభం ?

గణేశ్ :- పోదాముగా ఆ అపూర్వ ప్రదర్శనానికి మనంకూడా! తొందరెందుకు ?

గోపాల్ :- అసలు మోహన్ నాయన ఒకమాదిరివాడే! మోహన్ నటించటానికి యెల్లా ఒప్పుకున్నాడూ అంట!

గణేశ్ :- (చిఱునవ్వులో) ఆఁ, సమయానికి మంచిమాటే జ్ఞాపకం చేశావు. (లేచి బల్లముందుకు ఫ్లాజరు జేబులలో చేతులు పెట్టుకొనివచ్చి) ఈలోపల మనతంత్రాన్ని కొంత వరకు ఉపయోగించితే దానితో మోహన్ తోకముడుచు కుంటాడు.

గోపాల్ :- (లేచి అతని ప్రక్కకువచ్చి) ఏమిటాతంత్రం ?

గణేశ్ :- తరువాత చెపుతాలే ... (యోచనతో అటుయిటు తిరుగుచు) అంతేకాక, నాకిప్పుడు మరొక ఉపాయంకూడ తట్టుతోంది. అదేమిటంటే, మెల్లగా యెవరితోనైనా సరియైన పెద్దవాళ్లతో చెప్పి, వాళ్లద్వారా ఒక చక్కనిపని చేయిస్తాను.

గోపాల్:- ఏమిటాపని ?

గణేశ్:- మనవూళ్లో కేశవయ్యఉన్నాడు చూశావా ?

గోపాల్:- ఏ కేశవయ్య ?

గణేశ్:- బురదగేరిలో కేశవయ్య.

గోపాల్:- ఆవును, ఎఱుగుదును.

గణేశ్:- అతనికి ఫ్రరి రెక్కించేటట్లు చేస్తాను.

గోపాల్:- ఏమని ?

గణేశ్:- అతని మనుమరాలుఉన్నదే కళావతి అని, ఆమెను వీళ్లనాటకంలో నాయికాపాత్ర వేయటానికి గట్టిగా పోటీ తగిలి వీళ్లకు చికాకు కలిగించమని. అర్థమయిందా నేవేసిన యెత్తు ?

గోపాల్:- భేష్ ! అప్పుడు నీవు నిజంగా ప్రసాద్‌వాళ్ల పాలిటి ప్రత్యక్ష గణేశుడవౌతావు. (అని నవ్వుచు మరలకూర్చుండి యిరువురు చెస్సు నాడుచుందురు. తెరపడును.)

## మూడవ రంగము

[పుష్పలతగృహం. తానువేయబోయే యేదో ఒక నాటకములోని పాటను అభినయముచేయుచు పాడుచూ ఉండును.]

(హాయినిగొలిపే . . . . వలె)

పుష్పలత:-

1. ప॥ బాయని స్నేహాము భాగ్యముగొలిపే
మనోహరుడై కదుహాయీ; మనోహరుడై
కదుహాయ్ హాయ్ హాయ్.

2. చిలుకలుపలికే కోకిలపాడే
నెమళులు గలగల నాడగా
భువియెంతో పరిఢవించెనే
తనువెంతో పులకరించెనే॥ ॥ హా ॥

3. మధుభాషలు వెలయించి
మృదువేణువు గానముసేయగా

మనసెంతో జలదరించెనే
చనువెంతో సలిపిపోయెనే ॥ బా ॥

4. ఉత్తమాదృతిని ఒహోఒహోయని
ఉత్తమగానము సేయగా
మదియెంతో నటనజేసెనే
కమచింత మాయమాయనే ॥ బా ॥

శివయ్య:— (ప్రవేశించి) ఈపూటకు ఆసాధనచాలు లేఅమ్మా. ఎక్కువైతే శరీరం బడలిక చేస్తుంది. ఇంకా వారం రోజు లుందిగా నాటకం. కావలసినంత వ్యవధిఉంది.

పుష్పలత:— సరేలేనాన్న. నేనూ యిక్కడికే ఆపుదామను కుంటూఉన్నా. మళ్లీ సాయంత్రం కాసేపు సాధనచేస్తే సరిపోతుంది.

శివయ్య:— (కుర్చీలోకూర్చుండి) అల్లాగే; అన్నట్లు మనమింకా ఆసిరిపురంవాళ్లకు జవాబేమీ వ్రాయలేదమ్మా. పెద్దవాళ్లతో పని. త్వరగా వ్రాయకపోతే బాగాఉండదు.

పుష్పలత:— (ఆలోచించుచు కూర్చుండి) దేనికి జవాబు ? ఆ ప్లీడరుగారువ్రాసిన ఉత్తరానికేనా? అంటే యేదో పుర మందిరం కట్టించటానికి ఉచితంగా నాయికాపాత్రను ధరింపు మని కోరుతూ వ్రాశారే, దానికేనా?

శివయ్య:— అవును; అప్పుడే నాలుగురోజులైంది ఉత్తరంవచ్చి.

పుష్పలత:— వాళ్లు యేనాటకమని వ్రాశారు ?

శివయ్య:— వీరవిహారమట.

పుష్పలత:— అదా? అదైతే నాకు బాగా అలవాటే అనుకో.

కాని కేవలం ఉచితంగా నటించమంటే కొంచెం కష్టంగా ఉంటుందినాన్న.

శివయ్య:- అవునవును. అయితే ఉన్న విషయమేమిటంటే, నీవు అక్కడక్కడ ఉచితంగా నటిస్తున్నట్లు యిప్పటికే లోకానికి బాగా వెల్లడయింది. అందువల్ల వాళ్లుకూడ వ్రాసి ఉంటారు. అందులోను ఆనాటకం గ్రామాభివృద్ధికోసర మట! పెద్దవాళ్లందరు పూనుకొన్నారట!

పుష్పలత:- అదే నేనూ ఆలోచిస్తున్నది. అటువంటివాళ్లకు వ్యతిరేకంగా చెప్పటం చాలాకష్టం. అందులోను ఒక్కన వాళ్లందరు ఉచితంగా నటిస్తున్నారట. అటువంటప్పుడు నేనొక్కతెను డబ్బుకోరటం యేమి భావ్యంగా ఉంటుందా అని.......

శివయ్య:- అదే నాకుకలిగిన ఆందోళనకూడ.

పుష్పలత:- అయినా యింకా యెన్నాళ్లున్నదట నాటకం?

శివయ్య:- దాదాపు నెలరోజులపైనే ఉన్నదట. ఫలానివారము లో అని వ్రాశారుగాని, యింకా ఫలానిరోజు అని ఖండితంగా వ్రాయలేదు. అయినా వాళ్లు మన జవాబుకోసం యెదురుచూస్తూఉంటారు. అంగీకరించుకొన్నే, వాళ్లు తరువాత మనకు నాటకంవేసేరోజుకూడ తెలుపుతారు. ఇప్పటి కాలాన్నిబట్టి, ప్రజాభిరుచినిబట్టి కనీసం ఒక స్త్రీ అయినా నటిస్తూఉంటేనేగాని యేనాటకానికి జనాకర్షణ అంతగా ఉండదుగా. అందువల్లనే వాళ్లు నీకు అంతగా వ్రాసింది.

పుష్పలత:- అడగటం మరచిపోయాను, వాళ్లు ఉత్తరంలో

యేమని వ్రాశారు? ఊరికే శ్రీమతి పుష్పలతను ఉన్నారా?
లేక (త్గ్గుగొంతులో) నాట్యకళాతిలక, గానకోకిల అనికూడా
వ్రాశారా ?

శివయ్య:- అవికూడా ఉపయోగించారు.

పుష్పలత:- సరేఅయితే, జాగ్రతగానే వ్రాశారన్నమాట.

శివయ్య:- వారుమాత్రం కార్యవాదులుకారు? ఆమాత్రపు
వ్యవహారం వాళ్లకు తెలియకుండా ఉంటుందా?

పుష్పలత :- అయితే, యిప్పుడేమి వ్రాద్దామంటావు?......
అయినా, యింకా వాళ్లు నాటకం వేసేరోజు నిర్ణయించ
లేదుగా.

శివయ్య :- అవును, అందువల్ల నాకొకటి తోస్తోంది. అదేమి
టంటే, ' మీరు మీ నాటకం వేసేరోజు నిర్ణయించుకొని
వ్రాయండి; అప్పుడు నాకారోజు యింకెక్కడ పనిలేకుండు
నట్లు యేర్పాటు చేసుకొని మీకు వ్రాయగలుగుతాను'
అని జవాబు వ్రాద్దాము. దానివల్ల మనకు కొంత ఆలోచ
నకు అవకాశము కలుగుతుంది. ఇక మరల జవాబు వచ్చిన
తరువాత అప్పటిమాట అప్పుడు ఆలోచించుకోవచ్చు.

పుష్పలత :- అవును, అదే బాగుంటుంది. అదీకాక మనకింకొక
విషయంకూడ ముఖ్యం నాన్న. ఏమిటంటే, మనకు వాళ్ళు
పైకం యివ్వకపోయినా, కనీసం యెవ్వరైనా గొప్పవాళ్ళు
ఆ నాటకానికి అధ్యక్షులుగావచ్చి, మన నాట్యమునుగురించి
రెండుమాటలు చెప్పేవాళ్లైనా ఉండాలి. ఏమంటావ్ ?
లేకపోతే, మనం యింత శ్రమపడి నాటకంలో పాల్గొని

ఫలమేమిటి? అందులోనూ నాటకం యింకా నాలుగు రోజులున్నదనగానే రీహార్సలుకు అక్కడికి రావలసి ఉంటుందనికూడా వ్రాశారుకాదు వాళ్ళు?

శివయ్య :- అవును.

పుష్పలత :- అయితే రానూపోనూ ఖర్చులు వగైరాలైనా యిస్తామని వ్రాశారా?

శివయ్య :- ఆ, ఇస్తామని కచ్చితంగానే వ్రాశారు.

పుష్పలత :- సరే కానియ్యి, అయితే బాగా ఆలోచించుకొని సాయంకాలంలోపల యేదో ఒక జవాబువ్రాసి పంపిద్దాం.

శివయ్య :- సరే, అల్లాగే కానిద్దాం. ఎందుకంటావా?

చ॥ అరయఁగ స్వప్రయోజనము నాత్మఁదలంపక గ్రామసేవకై
బరగు ప్రజోపకారులగు వారలు; వారికి సాయమౌటయే
పరమకృతార్థమార్గమగు; ప్రార్థనజేసిన వారి సత్క్రియన్
సరగునదీర్చ నాట్యకళ సార్థకమాగద నీకు పుత్రికా!

(తెరపడును)

# నాల్గవరంగము

[రీహార్సలు గది. ప్రకాశ్, మోహన్, సుందర్‌లు కుర్చీలపై కూర్చుండి యుందురు. వారిమధ్య చక్కని బల్ల వేయబడియుండును. అన్యత్రస్థానములో ఒక కుర్చీ ఖాళీగా ఉండును. తెరలేచును.]

ప్రకాశ్ :- నీవు యీపాటను ప్రేక్షకులు చప్పట్లు కొట్టేటట్లు పాడవలెరా సుందర్?

సుందర్ :— ఎక్కడ పాడాలి ?

ప్రకాశ్ :— మనవీర విహార నాటకంలో.

మోహన్ :— సరిసరి ! ఇది మరీబాగాఉంది ! మన వీరవిహార నాటకంలో యేమేమి పాడవలెనో, యేమేమి అక్కఱలేదో యింకా నిర్ణయమే కాలేదే ! దాంట్లో సుందర్ యీ పాట యెల్లా పాడుతాడు ?

ప్రకాశ్ :— అవునునుకో; అయినా యిది చాలా బాగాఉంది. దీని నెల్లాగైనా సరియైన సందర్భముచూసి మన డ్రామాలో చేర్పించేట్లు చేయాలి.

మోహన్ :— కానియ్యి, మీ నాయనగారితో చెప్పిచూద్దాం. ఆయనగారు మన సంఘానికి కార్యదర్శి. పై పెచ్చు మన నాటకానికి దర్శకుడు. అందువల్ల మనం ఆయన సమ్మతి లేకుండా యే పనీ చేయకూడదు.

ప్రకాశ్ :— అవునవును; వారితో చెప్పే చేద్దాం.

సుందర్ :— అసలు, యింకొక విషయం. ఈ పాట మన నాటకంలో సందర్భానికి సరిగ్గా సరిపోతేనేగాని, దానిని చేర్చటానికి ఆయన గారు ఒప్పుకోనేవాడుకాడు. తెలిసిందా ? పాటలకు పద్యాలకు వన్సుమోర్లు కొట్టించటమంటేను, అసందర్భమైన పాటలు పద్యాలు చేర్పించటమంటేను, ఆయనకు యేమాత్రము సరిపోదు. నీవు యిక్కడున్నావని దాపరికమెందుకు ? ఆయనగారు దర్శకుడుగా పనిచేయటమున్నదే చాలా లెక్కాచారంగా ఉంటుందిగాని మనం యెల్లాపడితే అల్లా ఆడటానికి వీలుండదు. ఆయన మననాటక సంఘాన్ని

మహామంచి శిక్షణలో పెడతాడు. అందువల్ల మనం ఆయనతో ప్రవర్తించేటప్పుడు చాలా జాగ్రతగా ఉండాలి. ఆయన కేవలం నాట్యకళాభిమానంతోను, గ్రామాభిమానముతోను, మనకు దర్శకునిగా ఉండటానికి ఒప్పుకున్నాడు గాని, లేకపోతే తనప్లీడరు ప్రాక్టీసును కొంత తగ్గించుకొని వచ్చే నెలరోజులు మనకీచాకిరి చేయటానికి ఆయనకేమి అవసరం ?

మోహన్ :- (తెరవంకచూచి) అదుగో, వస్తున్నాడాయన.

విశ్వనాథరావు :- (ప్రవేశించి, ముందున్న అధ్యక్షుని కుర్చీలో కూర్చుండి అందరివంక ఒకసారిచూచి ఆశ్చర్యముతో) అందరు వచ్చినట్లు లేదే !

మోహన్ :- అవునండి, యింకా ఆరుమంది రావాలి. వాళ్లలో నలుగురు ఊళ్లో లేరు. రేపటినుండి తప్పక వస్తామన్నారు. తక్కిన యిద్దరు యేదో పని ఉన్నదట హైస్కూలుకు పోయారు. వాళ్ళుకూడా రేపటినుంచి సక్రమంగా హాజరవుతామన్నారు.

విశ్వనాథరావు :- (కొంచెము తీవ్రముగ) అప్పుడే మొదలా ! ఇదుగో యీ ఒడుదుడుకులే నాకు సరిపోవు. ఎనిమిదిన్నరకు సమావేశమవుకున్నాం. మీలో అందరు యిప్పుడు సెలవలున్న వాళ్లేకదా. మీరందరూ చదువుకున్నవాళ్లు. కేవలం మీ గ్రామంమీద ఉండే అభిమానంతోను, నాట్యకళమీద గౌరవంతోను, యీ నాటకం వేయబోతున్నారు. కాబట్టి మీపద్ధతులు యెప్పుడు తప్పుపట్టేటట్లు ఉండకూడదు.

ఇతరనాటక సంఘాలుకూడ మీ నడవడినిచూచి నేర్చుకొనే టట్లు ఉండాలి. మీకందరికీ యిది సమ్మతమేనా ?

సుందర్ :- సమ్మతమే.

విశ్వ :- సరే, యిప్పుడు తరువాత విషయానికి పోదాం. నేను మీ అందరికీ మీ మీ పాత్రలేవో మీ మీ మాటలు పాటలు వగైరాలేవో తెలుపుతానన్నాను కాదు ?

మోహన్ :- అవును.

విశ్వ :- అందువల్ల రేపు తప్పకుండా మీకవి యిస్తాను. రేపే కొన్ని రంగాలు మొదటిసారి చదవటం ప్రారంభిస్తాము.

సుందర్ :- మీరు పుష్పలతకు ఉత్తరం వ్రాశారే, దానికేమైనా జవాబు వచ్చిందా అండీ ?

విశ్వ :- ఆ, వచ్చింది. మన మొదటి ఉత్తరానికి ఆమె జవాబు వ్రాస్తూ నాటకం వేసేరోజు యేదో నిశ్చయించుకొని వ్రాయమన్నది. అంతేకాక ఆ జవాబులో యెవరైనా పెద్దవాళ్ళువచ్చి నాటకానికి అధ్యక్షత వహించబోతున్నారా అనికూడా అడిగింది. అదీకాక యెవరైనా పెద్దవాళ్ళు అధ్యక్షత వహిస్తే మన నాటకానికి జనాకర్షణ యెక్కువౌతుంది గాని తక్కువ కాదుగా. అందువల్ల నాట్యకళా సార్వభౌమ శ్రీ శివరామప్రసాద్ గారిని అధ్యక్షత వహింపుమని కోరుతూ వ్రాశాము. ఆయన నాకు బాల్యస్నేహితుడవటంచేత అందుకు సమ్మతిస్తూ వెంటనే జవాబువ్రాశాడు. అదే విషయం తెలియజేస్తూ మేము శ్రీమతి పుష్పలతకు కూడా జవాబు వ్రాశాము. అందువల్ల ఆమె సంతోషముగ

వచ్చి మన నాటకములో పాల్గొంటాననీ, మనము కోరి నట్లుగా నాయికా పాత్రే ధరించుతాననీ వ్రాసింది. ఇవీ గడచిన వారంరోజులనుండి మేము జరిపిన ఉత్తర ప్రత్యుత్త రాల వివరాలు.

సుందర్ :- అల్లాగా ! అయితే చాలా వ్యవహారం జరిగిందన్న మాట.

విశ్వ :- అప్పుడే యేమైంది ? ఎన్నో వ్యవహారాలు చేస్తేనే గాని నాటకం రంగిమెక్కదు.

మోహన్ :- అవునవును.

విశ్వ :- మీకిప్పుడు యింకేమైన తెలుసుకోవలసిన విషయా లున్నాయా ?

మోహన్ :- ఇప్పుడింక యేమీ లేవు.

విశ్వ :- సరే అయితే, రేపు రాత్రి సరిగ్గా యెనిమిదిన్నరకు యిక్కడే కలుసుకుందాం.

[అంతట అందరులేచి ఒక దిక్కునుండి నిష్క్రమింతురు విశ్వనాథ రావు మాత్రము డ్రామాపుస్తకమును చూచుచు కూర్చుండియుండును. మరి యొక దిక్కునుండి నోకతి, పొడుగైన కోటు, తలపాగ, చేతిలో పన్నుకట్ట గలిగి భుజంగరావను పంచాయతీ బోర్డుమెంబరు, కేశవయ్య, కళావతి ఒకరివెనుక ఒకరు ప్రవేశించి ఒకప్రక్క నిలతురు.]

భుజంగరావు :- (కేశవయ్యతో తీవ్రముగా) ఇదుగో కేశ వయ్యా, విశ్వనాథరావుగారు యిప్పుడు ఒక్కడే కూర్చుని యున్నాడు. కాబట్టి యిప్పుడు మనం వాళ్ళయింటికి పోవల సిన అవసరంలేకుండా యిక్కడే కలుసుకునే అవకాశం కలి గింది. నేనుకూడ మొట్టమొదటే మీతో రావటం అంత

బాగుండదు. అవసరమనితోస్తే తరువాత లోపలికపస్తాను. అందువల్ల ముందు నీవు మీ మనుమరాలిని లోపలికి తీసి కొనిపోయి నీ కోరికంతా ఆయనతో వివరంగాచెప్పు. అవ కాశం ఉంటే ఆమెతో ఒకమంచి పాటకూడ పాడించు. ఇంక అప్పటికీ అవసరమని తోస్తే నేను గట్టిగా సిఫారసు చేశాననికూడ చెప్పు. అప్పటికైనా నీకోరిక తప్పక నెరవేరు తుంది. అప్పటికీ నెరవేరకపోతే నేనే బాధ్యత వహించి వాళ్ళకు తగిన శాస్తి చేస్తాను.

కేశవయ్య :- (చేతులుజోడించి) తమరు యింతదూరము యెల్లాగో రానేవచ్చారు. ఈ కాస్త లోపలికివచ్చి తమరే వారితో రెండుముక్కలు చెపితే బాగుంటుందేమో అని మనవి చేసుకుంటున్నాను. కోపగించక రెండడుగులు లోపలికి దయచేయండి.

భుజంగరావు :- (కండ్లెఱ్ఱచేసి) నాకూ ఆయనకూ యిదివరకు ఒక వ్యవహారములో కొంచెం ఘర్షణ జరిగింది. అందువల్ల ఆయనను చూస్తేనే నాకు మాట చాలా దూకుడుగా పోతుంది. తెలిసిందా? అందువల్ల నీ కోరిక తీసివేయలేక యింతదూరం వచ్చాను. కాని నేను లోనికి రాకుండానే పని జరిగిందా, చాలా సంతోషం. లేకపోతే నేనప్పుడు లోపలికివచ్చి గట్టిగా మాట్లాడుతాను. నీవేమీ సందే హించవద్దు. నీపని నెరవేర్చటానికి నేనెంతవరకైనా పోతాను. సరేనా? అందుకని నీవింక యీ భుజంగరావు మాటవిని లోపలికి పో. ఈ భుజంగరావు పట్టినపట్టు విడిచేవాడు కాడని

నీకు తెలుసుగా.

కేశవయ్య :- (చేతులు జోడించి) చిత్తం, అయితే అంతవరకు తమ రెక్కడుంటారు ?

భుజంగరావు :- ఎక్కడో యెందుకు ? ఇక్కడే యీ అరుగు మీద కూర్చుని ఉంటాను. మీరు అనుకునే మాటలన్నీ నాకు బాగా వినబడతాయి.

కేశవయ్య :- చిత్తం. అయితే లోపలికి వెళ్ళివస్తాం. (అని నమస్కరించును. కేశవయ్యయు, కళావతియు, విశ్వనాథ రావువైపు పోవుదురు. భుజంగరావు నిష్క్రమించును.)

కేశవయ్య :- (విశ్వనాథరావుతో) నమస్కారమండి.

విశ్వ :- (తలయెత్తి) ఎవరు మీరు ?

కేశవయ్య :- మాది యీ ఊరే కదండి ? నేను కేశవయ్యను.

విశ్వ :- ఓహో ! ఏం కేశవయ్యా వచ్చావ్ ?

కేశ : ఏమీలేదు, తమతో ఒక చిన్నమనవి చేసుకుందామని-

విశ్వ :- అల్లాగా, ఏమిటది ?

కేశ :- తమరు మన గ్రామంలో ఉన్న పురమందిరం మరమ్మతు చేయించటానికి ఒకనాటకం వేయిస్తున్నారట కదండి ?

విశ్వ :- అవును.

కేశ :- (చేతులు నలుపుచు) మరి...ఆ నాటకంలోనండి...... ఏం చెప్పను ?......పెద్దోళ్ళకు తెలియనిదేముంది లేండి ?

విశ్వ :- అంటే నాకర్థం కావటంలేదు. మీ అమ్మాయి యేమైనా డ్యాన్సు చేస్తుందా ?

కేశ :- అబ్బే, ఒట్టిడ్యాన్సే కాదండి. ఈ అమ్మాయి నా మను

మహాలు. ఈమె పేరు కళావతి. ఈమె మహరాసులో 5 సంవత్సరాలనుండి బాగా పాడటం, నాటకాలలో నటించటం నేర్చుకున్నదండి. పదిరోజుల క్రిందటనే యిక్కడికి వచ్చింది. ఇప్పుడు తమ నాటకములో నటించాలని చాలా కుతూహల పడుతోంది.

విశ్వ :- అల్లాగా ! అలా కూర్చోండి (ఇరువురు యిరుప్రక్కల నున్న కుర్చీలపై కూర్చుందురు.) మా నాటకంలో యింకా ఒక చిన్న పాత్ర మిగిలిఉంది. కావలెనంటే అది సంతోషంగా యివ్వగలను. తక్కినవన్నీ అప్పుడే యివ్వబడి పోయినాయి.

కేశ :- అల్లా కాదండి. మీ నాటకంలో నాయికాపాత్రే వెయ్యాలనీ, తాను నేర్చుకొనిన నటనాచాతుర్యమంతా చూపి మీ అందరిమెప్పు పొందాలనీ, చాలాచాలా ఉవ్విళ్లూరుతోందండి.

విశ్వ :- (అనుమానముగ) ఇదివరకు యెక్కడైనా నాటకాలలో పాత్ర వేసిందా ?

కేశ :- వెయ్యకేమండి అయితే మన జిల్లాలలో వెయ్యలేదు. ఇదే మొదటిసారిగా మనగ్రామంలో నాయికాపాత్ర వెయ్యాలని చాలా కుతూహలపడుతోంది.

విశ్వ :- నాయికా పాత్రనుగురించి యిదివరకే మా కార్యవర్గము వారంతా యోచించి ఒకామెకు వ్రాశాము. ఆమె సమ్మతిస్తూ జవాబుకూడ వ్రాసింది. ఇప్పుడు మార్పుచేయుటం యెల్లాగు ? ఇంతకు ముందైనా వచ్చి చెప్పిఉంటే మేమ్ము

నీకోర్కె తీర్చటానికి అవకాశం ఉండేది. ఇప్పు డావిషయం మా చేతిని మించిపోయింది...పోనీ, ఆనాటకంలో యింకొక స్త్రీ పాత్ర ఉంది. అది తీసుకోటానికి యిష్టమేనా? కావలె నంటే దానివిషయం ఆలోచించి రేపు చెప్తాను. "

కేశవయ్య :— అదికాదు, మీరు యెవరికో యింకొక ఆమెకు వ్రాశామంటున్నారే, ఆమెకంటె మా అమ్మాయి దేనిలో తక్కువో దయచేసి ఆలోచించండి. ఆ పుష్పలతను నే నెరుగని వాడనుగాను. మా కళావతి పాట ఒక్కటివింటే యెవరిశక్తి యెటువంటిదో మీకే తెలుస్తుంది. ఏమే అమ్మాయ్, ఒకచక్కని పాటపాడి వినిపించవే పంతులుగారికి.

విశ్వ :— ఇప్పుడెందుకు పాట ? అనవసరముగా ఆమెకు శ్రమ యెందుకు ? నేను విచారించి రేపు చెపుతాను.

కేశవయ్య :— అయితే, నేను మిమ్మలిని వేడుకొనేది యేమిటంటే, యివ్వగలిగితే ఆమెకు నాయికా పాత్రే యివ్వండి. తక్కినపాత్రలు ఆమెకు అక్కఱలేదు.

విశ్వ :— ఉన్న గొప్పతనమంతా నటనాచాతుర్యములో ఉన్నది గాని, పాత్రలో యేమున్నది కేశవయ్యా ? బాగా నటించే వాళ్ళకి యేపాత్ర అయితేనేం ?

కేశ :— మీకు మరొక మాటకూడ చెప్పటం మరచిపోయాను. మన పంచాయతీ బోర్డుమెంబరుగా ఉన్నారు చూశారు ? భుజంగరావుగారు. వారుకూడా తమమాటగా గట్టిగా చెప్పమని మరీమరీ సెలవిచ్చారండి.

విశ్వ :— అల్లాగా ! అయితే ఆలోచించి రేపు చెపుతాను ఆచిన్న

పాత్ర విషయం.

కేశ :— (ఆశ్చర్యకోపములతో) మరల ఆచిన్నపాత్రే అంటున్నారే! తెలియక అడుగుతున్నాను, మా అమ్మాయి ఆ పుష్పలతకంటె దేంట్లో తక్కువో దయచేసి చెప్పండి.

విశ్వ :— అదంతా మీరడగటం భావ్యంకాదు; నేను చెప్పటం అంతకంటే భావ్యంకాదు. ఎవరి యోగ్యతా యోగ్యతలు వారివి.

భుజంగరావు :— (తీవ్రముగ ప్రవేశించి అతితీవ్రముగ) ఎందుకు భావ్యంకాదు! నేను యిందాకటినుంచీ మీ మాటలన్నీ వింటూనే ఉన్నాను. మీవైఖరి చూస్తూనే ఉన్నాను. మన ఊరిలోనే ఒక మంచి నటీమణిని పెట్టుకొని యెక్కడి నుంచో మరొక ఆమెను తెప్పించవలెనా? అది మనఊరికే అమర్యాదకాదు? మీరు నా సిఫారసు యందైనా గౌరవముంచి ఆమె నాయికాపాత్రకు ఒప్పుకుంటారని నమ్మి యీ విధంగా మోసపోయాను. మీరు మొదటినుంచీ నా మాటయందు యిదేవిధంగా నిర్లక్ష్యభావం చూపుతునే ఉన్నారు. అంతెందుకు? ఇటీవల కోర్టులో జరిగిన నా కేసులో నా పక్షమున వకాలత తీసుకోమని యెంత కోరినా తీసుకోక, పైపెచ్చు నాకు వ్యతిరేకుల తరఫున వకాలత తీసుకొని, చివరకి అవమానముతో ఓడిపోలేదా? అప్పటికైనా మీకు నా మీద నిర్లక్ష్యభావం తగ్గిందేమో అనుకున్నాను. కాని అది యేమాత్రము మారినట్లులేదు. కాబట్టి నేను చివరిమాటగా మీకు ఒకటే మాట చెప్పు

తున్నాను వినండి. మీరు యితర సభ్యులతో విచారించైనా చేయండి, విచారించకుండా నైనా చేయండి, లేక యింకా యే విధంగానైనా చేయండి, యిస్తారా మీరు మాట్లాడకుండా యీమెకు నాయికాపాత్ర యివ్వండి. లేదా, దీనివల్ల జరిగే ఫలితాలకు సిద్ధంకాండి. మీరు నా మాటను ధిక్కరించి మన ఊర్లో యెల్లా నాటకంవేస్తారో, యెల్లా పురమందిరం మరమ్మతు చేయిస్తారో చూస్తాను. ఒక్క నటీమణికి నాటకంలో తా విన్యాటానికి నావంటి వాని చేత చెప్పించుకోవలెనా మీరు ?

విశ్వ :- (అణచుకొనిన కోపముతో కండ్లెఱ్ఱచేసి లేచి నిలచి) భుజంగరావుగారూ, మీరు యింత మర్యాద మీరి మాట్లాడుతారని యెన్నడు అనుకోలేదు. మీ బెదరింపులకు భయపడి మీరు ఆడించినట్లెల్లా మమ్ములిని ఆడమంటారా ? ఎప్పుడో జరిగిన మీ కేసు వ్యవహారములోని విషయమును తెచ్చి మీ కసిని నాపై వెళ్లబోయటానికి యీ అవకాశాన్ని ఉపయోగించుకుంటున్నారా ? ఇది మీ మర్యాదకు తగినపనేనా ? అంతా మించిపోయిన తరువాత వచ్చి మాకు నాయికాపాత్రే కావాలంటే, మీరే మా స్థానములో ఉంటే యివ్వగలరా ? ఈ ఆసక్తి మొట్టమొదటే యేమైంది?

భుజం :- ఇప్పుడైతే మాత్రం యేమి ఆలస్యమైంది ? ఆ ప్రప్ప లతకు రావద్దని వ్రాస్తే మానుకోదా ?

విశ్వ :- అంతా ఒప్పుకున్న తరువాత యిప్పుడు ఆ విధంగా వ్రాయటం మన సంఘానికి మర్యాదగా ఉంటుందా ? మనం

చేసిన నిశ్చయాన్ని మనమే నిలబెట్టుకో లేకపోతే యింక మనకేమి మర్యాద ఉంటుంది ?

భుజం :- మహామర్యాద ! మనసులో యిష్టం లేకపోతే సరి, పైకి యేవో కుంటికారణాలుచెప్పి తప్పించుకొనేది. అయినా యిన్నిమాటలు అనవసరం. మీ నాటకం యీ ఊరిలో నెగ్గవలెనంటే మీరు మాటాడకుండా ఆ కళావతికి ఆ నాయికాపాత్ర యివ్వండి, లేకపోతే తరువాత జరిగే ఫలితాలకు సిద్ధంకాండి. ఒక్కటే మాట.

విశ్వ :- అసలు మొట్టమొదట ఆ కేశవయ్య ముఖంచూసి, కనీసం ఆ రెండవ పాత్రైనా సభ్యులతో మాట్లాడి ఆమెకు యేర్పాటు చేద్దామనుకున్నాను. కాని యిప్పుడు యింక నా నిశ్చయం వినండి. మీరిప్పుడు యింతగా మర్యాద మీరి మమ్మలిని బెదరిస్తున్నారు కాబట్టి యిక ఆ రెండవ పాత్రకూడా ఆమెకు యివ్వదలచుకోలేదు. అటు సూర్యు డిటు పొడిచినా సరే, యీ విశ్వనాథరావు దర్శకుడుగా ఉన్నంతకాలము యీ కళావతికి యీ నాటకములో స్థానం లేదు. మామ్మాటికీ స్థానంలేదు. ఇక ఆ పైన మీ యిష్ట మైన పని మీరు చేసుకోవచ్చు.

భుజంగరావు :- అయితే కానియ్యండి, మీ నాటకం యెల్లా జరుగుతుందో చూస్తాను. మీ సంఘానికి తగిన శాస్తి చేయకపోతే యీతడు భుజంగరావు కాడు. (కేశవయ్యతో) రండిక మనం పోదాం. తరువాత కథ మీరే చూద్దురు గాని.

(ముగ్గురు నిష్క్రమింతురు. విశ్వనాథరావు అచ్చటనే నిలచును.)

విశ్వ :- (కోపముతో తనలో)తరువాత కథట! తరువాత కథ ! ఇల్లాంటి తాటాకు చప్పుడులకు భయపడేవాడు కాడు యీ విశ్వనాథుడు. (మరియొక దిక్కు నిష్క్రమించును. పిమ్మట గణేశ్ వికటహాసముతో ప్రవేశించి)

గణేశ్ :- (తనలో ఉల్లాసముతో) అల్లా అంటుకోవాలీ మంటలు ! ఇల్లా పనిచేయాలి మన పన్నుగడలంటే ! అటువైపు మోహన్ యెత్తులకు యిటువైపు మన పై యెత్తులు ! ఇంక యెవరు గెలుస్తారో తెలుస్తుంది. ఇంతటితో ఊరుకోక ఆ మోహన్ కాళ్లకుకూడా బంధాలు వేయటానికి ప్రయత్నిస్తాను. ఆ పైన మన కత్తి కడ్డంలేకుండా ప్రకాశ్‌తో నా పేకాట పందెములు సాగుతాయ్. నాకు కావలసింది అంతే. (అని నిష్క్రమించును.)

మోహన్ :- (మరియొక దిక్కునుండి అనగా విశ్వనాథరావు నిష్క్రమించిన దిక్కునుండి ప్రవేశించి తనలో) : అప్పుడే వీడెంతదూరము పోయాడు ! హుం ! పిల్లి కళ్లుమూసుకొని పాలు తాగుతూ, తనను యెవ్వరు చూడటం లేదనుకుంటుందట ! ఎన్ని విధాల చెప్పినా వినక మా పనికి ఆటంకాలు కలిగించాలని యీ రీతిగా నీచమైన కుట్రలు పన్నుతున్నావా ? నీ చేష్ట లెవ్వరూ గమనించటం లేదనుకుంటున్నావు కాదు పాపం ! తాడిచెట్టెక్కేవాడికి తలతన్నేవాడుంటాడనే విషయం మరచిపోయావు కాబోలు ! కానీ,

సె విపరీతబుద్ధికి తగిన ఫలితం త్వరలోనే అనుభవించు తావులే. నీ పేకాట పిశాచమే నీ దుష్టబుద్ధికి తగిన శాస్తి చేస్తుందిలే! జాగ్రత! (అని వచ్చిన దిక్కునే నిష్క్రమించును.)

## ఐదవ రంగము

[ రీహార్సల్సునగరి. పైరంగములో వలెనే కుర్చీలుండును. కాని ముందున్న బల్లలు మాత్రము తీసివేయబడును. విశ్వనాథరావు, ప్రకాశ్, మోహన్, సుందర్ కుర్చీలపై కూర్చుండి యుండుదురు. తెరలేచును.]

విశ్వ :— ఇంతవరకు వచనం రీహార్సల్ అయింది కాబట్టి,యిప్పుడింక సుందర్, నీ పద్యమేదీ? ఒకసారి చెప్పు.

సుందర్ :— సరే (లేచి తగిన అభినయముతో)

సీ॥ పోయెనే ధర్మవిస్ఫూర్తి లోకమునందు
ధర్మశీలురకింక దారిలేదె?
మారెనే మోక్ష సామ్రాజ్యాభిలాషలు
ధరను తాపసులకు తెరువులేదె?
సమసిపోయెనె నైజ శాంతగుణంబులు
పశుబలంబే మన పాలబడెనె?
ప్రాప్తించెనే పాపవర్తన నరులకు
కలిశక్తి భువిపైన ఘనతగనెనె?
గీ॥ చెలఁగి మారణయంత్రమే యిల సమస్త
దేశములకు మంత్రరాజమై తేజరిల్లెనె?

సాధుజన రక్షణంబింక సాగిరాదె ?
కడకు లోకంబు నరకలోకంబె యౌనె ?

(అని కూర్చుండును.)

విశ్వ :- మోహన్, నీ పాటయేది ? ఒకసారి కానియ్యి.

మోహన్ :- (తెరలోనికి ప్రవేశించి, వీరావేశముతో మరల ప్రవేశించుచు)

పాట.

(కిస్మత్ ముసానె......వలె)

బెదరించి పారిపోయెదవా వైరివీరుడా
నేనిపుడె నిన్ను దుమ్మించెదరా ఓరి క్రూరుడా !
ఓరి చోరుడా !

1. నీ కండకావరంబు యీ వీరునెదుటనా?
నిల్ నిలువుమోరి పారుబోత పలుకవదేలా ?
ఈ దేశజనులు భీరులంచు నెంచియుంటివా ?
నీ శౌర్యమేమొ చూచువాడ నిలుము వంచకా ॥-

2. ఏమేమి యిట్లు పారెదవు యింత ధైర్యమా ?
ఏమింక నిన్ను గాచువారె యిచ్చటలేరా ?
జ్వలియించు అగ్నితోడ నీవు ఆడదలతువా ?
నీప్రాణములను బూదిపాల్ జేయుటెరుగవా ॥

3. నీ విట్లు దేశమెల్ల ద్రోచి పోవనెంతువా ?
ఓరోరి కాచుకొమ్ము నాదు ఖడ్గధారలన్
పలుగాకివోచు పందవోలె పారిపోకుమా

నేనింక నిన్ను విడచిపుచ్చి పోవనిత్తునా
నేనిపుడె నిన్ను ద్రుంచెదరా ఓరి చోరకా ॥

ఓరీ మదాంధుడా ! నీకెంతటి మేకపోతు గాంభీర్యములా! కాచుకొమ్ము ! నీ ప్రాణముల నిప్పుడే నా ఖరాసికి బలిచేసెదను ! (అని నిష్క్రమించును.)

విశ్వ :- (ప్రకాశ్‌తో) అబ్బాయ్, నీ పద్యమేది ? మరొకసారి చెప్పు. ఈసారి సరిపోయిందేమో చూద్దాం.

ప్రకాశ్ :- (లేచి లోనికేగి ఎడమవైపు వ్రేలాడుచున్న ఒర లోని కత్తిపిడిపై కుడిచేయి వైచినట్లు నటించుచు వీరావేశముతో వడిగా ప్రవేశించుచు)

మ॥ అరెరే ! యెంతటి పాఱుబోతువుర !
నీ యార్భాట మింకేలరా ?
పరరాజ్యంబు హరింపగా దలచినావా? శక్తి నీకున్నదా?
కరవాలంబుకు విందుచేసెదను నీకాయంపు
దుర్మాంసముల్,
ఎఱుగన్నేరవొ వీడెవండొ యిక నందే నిల్వరా
మూఢుడా !

ఓరీ ! నీచాధమా ! అట్లు పిరికిపందవై పారిపోవుచుంటివేల ? అచ్చటనే నిలువుము ! క్షుద్రజనకంఠలుంఠన ప్రచండ భుజదండ మండితోద్దండుడగు యీ వీరప్రతాపుడిచ్చట నున్నాడని నీ వెఱుంగవా? ఇదిగో కాచికొమ్ము! నిన్నిప్పుడే యీ కరవాలమునకు బలిచేసి యమసదనమున కనిపెదను. (అని వడిగ నిష్క్రమించును.)

విశ్వ :— సరిపోయింది, ఫరవాలేదు ఇంకా రెండు మూడు సాధనలతో పూర్తిగా బాగుంటుంది. (చేతిగడియారము నంక చూచి) 9-55 అయింది. ఇవ్వాళ్ళ కిక్కడికి చాలించుతాం. మీలో యింకా కొందరు మాటలు బాగా కంఠస్థము చేయలేదు. అవి బాగా నోటికి వస్తేనేగాని సరియైన భావోద్రేకముతో చెప్పటానికి, సరియైన నటనచేయటానికి వీలు కలుగదు. వీలు కలిగినప్పుడు మీరు యింటిదగ్గఱ కూడ సాధనచేస్తూ ఉండండి.

మోహన్ :— (విశ్వనాథరావుకు తనమాటల కాగితము చూపుచు) ఇక్కడ నాకొక పద్యము వేస్తే బాగుండదా అండి ? నాకు పాడాలని కోరికగా ఉంది.

విశ్వ :— (చిఱునవ్వుతో) పాట పాడినంత బాగా పద్యంకూడా పాడగలవని నీకు ధైర్యమున్నదా ? ఆ పద్యం చెడగొడితే కష్టం.

మోహన్ :— లేదులేండి, శ్రద్ధగా సాధన చేస్తాను.

విశ్వ :— అసలు నీ కాగితమేది ? సందర్భము చూడనియ్యి. (కొంచెముచూచి) సరే, అదేభావము వచ్చేటట్లు పద్యం ఒకటి మన రామమూర్తిగారిచేత రేపటికి వ్రాయించుతానులే.

సుం :— మా కందరికీ సరియైన దుస్తులు, కిరీటాలు, హారాలు, కత్తులు వగైరాలన్నీ యెక్కడినుంచి తెప్పిస్తారండి? ఆ దుస్తులతో మేము కనీసం రెండు మూడు సార్లైనా రీహార్సల్సు చెయ్యాలి. లేకపోతే నాటకంరోజున యే రంగము లో

యెవరు యే దుస్తులు వేసుకోవాలో తెలియక తారుమారు పడవలసి వస్తుంది.

విశ్వ :- అభయమేమీ అక్కఱలేదులే. వానికి తగిన యేర్పాటులన్నీ ముందే చేస్తున్నాం.

సుందర్ : సరేలేండి; అల్లాగయితే ఫరవాలేదు.

విశ్వ :- అయితే, యింక వెళదమా ?

మోహన్ :- అల్లాగే.

(అందరు లేచి నిష్క్రమింతురు. తెరపడును.)

## ఆఱవ రంగము

[ప్ర[illegible]లత గృహంలో ఒకగది. ఆమె ప్రవేశించును.]

పాట

([illegible]......[illegible])

మేలుకోనర వీరుడా......మేలుకోనర వీరుడా
మేలుకోర వీరా.........మేలుకోర వీరా ॥

1. ఆట పాట లాడగా వేళగాదులేరా! వేళగాదులేరా ॥
2. దేశమాత నిన్ను పిలచి శౌర్యఖడ్గ మొసగురా
లెమ్ము ఓ వీరుడా ధీరుడవై ఖడ్గమున్ దాల్చుమా
భరతమాత ఋణంబు దీర్చలేర వీరా!
వేళయయ్యెలేరా! ॥ మే ॥
3. హల్టాహల్టిన్ విహారభూమిజేరి పోరుమా
[illegible]పోయెరా దేశము, [illegible]పోయెరా తేజము

నిదురలోన మునుగగా వేళగాదులేరా,
వేళగాదులేరా ॥ మే ॥

4. దేశమాత నెదురుగాచూచి లేవవేరా
ఒళ్ళు మరచిరే కలచియే వారలన్ విడతువా?
లేచిరారా వీరుడా లేర ధీరుడా ॥ మే ॥

శివయ్య :- (ప్రవేశించి) అమ్మాయీ, నీ విక్కడ పాడుకుంటూ ఉండగా మనవాకిట్లో ఒక పెద్దగొడవ జరిగింది తెలుసా? నిన్నుకూడ యెందుకు తొందరపెట్టాలిలే అని పిలవలేదు.

పుష్పలత :- (ఆసక్తితో) ఏమిటి నాన్న అది?

శివయ్య :- ఆ సిరిపురంలో ఉండే పంచాయతీబోర్డు మెంబరట, ఆ ఊర్లో నాటకాన్ని గురించి మనతో మాట్లాడటానికి వచ్చాడు.

పుష్పలత :- ఓహో! ఏమి మాట్లాడాడు?

శివయ్య :- ఏమిటి నా మొహం! అక్కడ ఆ నాటకం విషయం చూస్తే చాలా రసాభాసంగా ఉన్నట్లు కనబడుతోంది.

పుష్పలత :- అల్లాగా! ఏమిటా రసాభాసం?

శివయ్య :- ఆ ఊర్లో ఒక నటీమణి ఉన్నదట!

పుష్పలత : నటీమణా! ఆ ఊర్లోనా! నాకు తెలియకుండా అక్కడ యెవరున్నారబ్బ! ఆ నటీమణిపేరు?

శివయ్య :- ఆమె పేరు చెప్పుమని యెంత పోరాడినా ఆయన గారు చెప్పనేలేదు.

పుష్పలత :- అయితే, యింతకీ యేమిటి విషయం?

శివయ్య : ఆ ఊర్లో కొందరికి ఆ నటీమణికే ఆ నాటకంలోని

నాయికాపాత్ర యివ్వాలని పట్టుదలట! కాని ఆ నాటక సంఘానికి మాత్రం అది యిష్టంలేదట. ఈ వచ్చిన మెంబరు కూడ ఆ నటీమణి తరఫు వానివలె ఉన్నాడు. ఉపాయంగా ఆవిషయమంతా చెపుతూ వచ్చి చివరికి ఉద్రేకంతో "మీా అమ్మాయి అక్కడికివచ్చి నటించటం అంత మంచిదికాదు" అన్నాడు. అందువల్ల మనకు నటించటానికి వీలుకాదని యేదో ఒక కారణంపెట్టి నాటకసంఘం వాళ్ళకి వ్రాయుమని చెప్పాడు.

పుష్పలత :— అబ్బా! పెద్దచిక్కే పెట్టాడే! మనకెందుకు యీ లేనిపోని బెడదంతా? అల్లా వ్రాయటం యిప్పుడు మర్యాదగా ఉండదని ఆయనతో చెప్పకి పోయినావా?

శివయ్య :— అదే పరిపరివిధాలా చెప్పాను.

పుష్పలత :— దానికి ఆయనేమన్నాడు?

శివయ్య :— ఒక్కసారి అమాంతంగా కండ్లెఱ్ఱచేస్తూ "మీా అమ్మాయి గనక అక్కడికివచ్చి ఆ నాటకంలో వేషం వేసిందా అంటే, ఆమె మర్యాదకు లోటువచ్చే మాట నిజం. జాగ్రత!" అన్నాడు.

పుష్పలత :— (ముఖము చిట్లించుకొని) అంటే? నా కర్థం కావటంలేదు. ఏమి చేస్తారట?

శివయ్య :— ఆ ఊర్లో ఉండే నటీమణితో సరిగా పాట పాడటానికిగాని నటించటానికిగాని నీకు అర్హతలేదని ఆమె చేతనే ఆ నాటకరంగంమీాద సవాలు చేయిస్తారట!

పుష్పలత :— (కోపోద్రేకముతో) ఆఁ! ఏమిటి? ఏమన్నాడు?

ఉన్నాడా ఆయనిక్కడ యిప్పుడు ?

శివయ్య : లేడు. అటువంటివానితో వాదం పెట్టుకోటం మనదే తప్పని "మీరు చెప్పినట్లుగా చేస్తా"మని సమాధానపరచి పంపించాను.

పుష్పలత :- ఎందుకు లొంగాలి నాయనా అటువంటివారికి ? అటువంటి బెదరింపులు చేయటానికి ఆయనే జంకనప్పుడు, ఆ బెదరింపేమిటో చూసేవస్తామని చెప్పటానికి మనమేల జంకాలి ? ఎవరి గొప్పతనం వారిది. ఆమెను వాళ్ళు నాయికా పాత్ర యివ్వకపోతే, వాళ్ళకోపం అక్కడివాళ్ళమీద చూపించుకోవాలి గాని నిష్కారణంగా మనపైన చూపిస్తారా ?

శివయ్య :- అవునవును; అదంతా నేను వివరంగా చెప్పాను. కాని ఆయన 'తరువాత మమ్మల్ని అని లాభంలేదంటూ తీవ్రంగా హెచ్చరించాడు.

పుష్పలత :- (ఏవగింపుతో) హెచ్చరింపు ! మహానాట్యకళా విచక్షత తెలిసిన ఘనుడులాగా ! ఈ ఘనుడు నన్ను యీ నాటికి పరీక్షచేయటానికి బయలుదేరాడు కాబోలు ! రంగమెక్కిన తరువాత యెవరి యోగ్యత యెల్లా ఉంటుందో యెవరు చెప్పగలరు ? అది అప్పటి వేళావిశేషాన్నిబట్టి ఉంటుంది. అందుకనే కళ కేవలం మనోధర్మమునకు చెందినదన్నారు. వాళ్ళు నన్ను ఆహ్వానించినందువల్ల నటించటానికి ఒప్పుకున్నాను గాని, ఆ నటీమణిపైన పోటీగా ఒప్పుకున్నానా ? అసలు అక్కడ ఒక నటీమణి ఉన్నట్లే నాకు

తెలియదే ! అటువంటప్పుడు వాళ్ళు నాపైన కత్తులు నూరటం యేమి న్యాయం ?

శివయ్య :— ఇవన్నీ నేను ఆయనకు వివరంగాచెప్పి యేదో విధంగా సమాధానపరచి పంపించాను. ఎందుకంటావా ?

సీ॥ ఈ మానవుని మాటకేమి లెమ్మందుమా
తెలియ వచ్చుటి పరిస్థితులు మనకు ।
ఈ వ్యక్తిమాటలే భావ్యమానందుమా
ఆడితప్పుట దోషమగును మనకు ।
ఈతనితో వైరమేల లెమ్మందుమా
పాటింప నది తలవంపు మనకు ।
ఈ ఘను నెదిరించియే గుదమందుమా
భావింప తొందరపాటు మనకు ।
గీ॥ ముందు నుయ్యి వెన్క గొయ్యి చందమయ్యె ।
ఇట్టి క్లిష్టపరిస్థితు లెసగినపుడు ।
బాధనొందక పరులకు బాధలిడక ।
నేర్పుమీరంగ కార్యముల్ దీర్పవలదె ?

పుష్పలత :— అయితే అసలు అక్కడ పరిస్థితులు నిజంగా యెల్లా ఉన్నాయో తెలిసికోకుండా మనం రాలేమని వ్రాయటం భావ్యం కాదన్నమాట.

శివయ్య :— అవును-

పుష్పలత :— అయితే యీ విషయంలో యేమి చేద్దామంటావ్ ?

శివయ్య :— ఏమీలేదు; ఈ విషయం అన్నాయితో కూడ అలో

చించి, వాడు ఒప్పుకుంటే ఒకసారి నాడి నక్కడి పరిస్థితులు తెలుసుకురమ్మని పంపుదాం. దానితో నిజం బయట పడు తుంది. ఏమంటావ్ ?

పుష్పలత :— సరే, అల్లాగే చేద్దాం. మనం మర్యాదను విచా రించి ప్రవర్తించాలిగాని, ఆ నటీమణి బెదరింపులకు గదరిం పులకు భయపడరాదు.

శివయ్య :— సరే కానియ్యి, నీ పని నీవు చూచుకో, అన్నాయి రావటంతోటే మాట్లాడి తగినట్లు చేద్దాం.

పుష్పలత :- (తెరవంకచూచి) అదుగో, అన్నాయి రానే వస్తు న్నాడు. మనం అక్కడికేపోయి మాట్లాడుదాం పద.

(ఇరువురు నిష్క్రమింతురు. తెరపడును.)

# ఏడవ రంగము

[సిరిపురములో చిక్కప్ప అను ఒక కాపువాని గొడ్లచావిడి. చావిడి లోని యెండుగడ్డి వర్గై రాలను అటుయిటు సర్దుచు, చావిడిని చీపిరితో ఊడ్చుచు, సన్నగఉన్న చిక్కప్ప తనలో తాను తక్కువ గొంతుతో యీక్రింది పాటను పాడుచుండును.]

చిక్కప్ప :— పాట

అరిఅరీ నారాయణాది నారాయణో
కరుణించి మమ్మేలు కమలలోశనుడా ॥ అ ॥
బళిబళీ మా తాత బల్లెంబు సేబూని
పుల్లాకు తూటుగా పొడిచేసినాడోయ్ ॥ అ ॥
ఎద్దుచచ్చిపోయంగ నోటులెత్తి పారంగ

ఉంకించి ఉంకించి దుం కేసినాడోయ్ ॥ అ ॥
నూటయిరువదిగులరాయి ఊరిలో నుంచేను
ఒక్కగంతున యెగిరి పైన నిల్చాడోయ్ ॥ అ ॥
వెయ్యిగజములపాటి కాగితపు గోలుసుంటె
ఒక్కదెబ్బతో దాని ముక్కసేశాడోయ్ ॥ అ ॥
(తెరవంకచూచి) ఎవర యీ దారినే వత్తుండారు ?
(తేరిచూచి) ఓహో ! మన బొజ్జయ్యల్లే ఉండాడే ! అవును బొజ్జయ్యే ! రానీ, కొంచెంసేపు ఎకసెక్కాలాడి పంపిత్తా. (ఇంతలో పెద్దబొజ్జ, బుజ్జమీసాలు, తలపాగా, పంచ కలిగి బొజ్జయ్య ప్రవేశించును.)

చిక్కప్ప :- (బొజ్జయ్యవైపు వెళ్ళి) ఏంరోయ్ గుమ్మడికాయ్ ? ఎక్కడినుంచి యీయేళప్పుడొత్తుండావ్ ?

బొజ్జయ్య :- ఓహో ! నీవా ! ఏం లేదురా మిరపకాయ్, యిక్కడినుంచే నత్తుంటా.

చిక్కప్ప :- ఇక్కడనుంచే అంటే ?

బొజ్జయ్య :- ఆఁ, ఇక్కడ నుంచేలే.

చిక్కప్ప :- అదుగో, అదే నాకు సరిపోదు. ఎక్కడనుంచిరా అంటే, యిక్కడనుంచే యిక్కడనుంచే అని టక్కరిత్తావే ! నేనేం కళ్లు మూసుకుండా ననుకున్నావో ? నీ బొజ్జ సూత్తేనే తెలుత్తోందిలే. ఏడకో ధర్మపిండాని కెళ్లొత్తున్నట్టుండావ్. ఇదుగో సూడు, నీకు ఆ బగమంతుడు (బొజ్జను వ్రేళ్ళతో కొడుతు) ఆ సక్కని బొజ్జయిత్తే (వేలుతో తన తలచూపుచు) నాకూ కొంచెం బుద్ధి యిచ్చాడు తెలుసా?

నీ వేమీ తెలియనట్లొత్తే నే నంతమాత్రం తెలుసుకోలే ననుకుండావా !

బొజ్జయ్య :– ఆఁ, లేదురా, యీ శేసన్ రోజుల్లో నీకు నాకు ధర్మపిండా లెవ రేత్తారు ?

చిక్కప్ప :– ఏమో, నీవట్టా అంటావేగాని ఆ శేసన్ గీసన్ నీ బొజ్జ (అని తట్టి చూపును) మీద నేమీ పనిసేసి నట్లు లేదే.

బొజ్జయ్య :– నీ దంతా పిచ్చిగాని, ఎక్కడైనా [illegible] [illegible] త్తుంది ! చిన్నప్పుడు యేదో కొద్దిగానో గొప్పగానో కసరత్తు చేసిన పైల్మానును గాబట్టి యీ మాత్రం అందమైన బొజ్జైనా వచ్చింది. ఇటువంటి చక్కనైన బొజ్జ నీకు రమ్మంటే మాత్రం వత్తుందనుకున్నావా ? దానికీ అదృష్టం ఉండాలి.

చిక్కప్ప :– ఏం అదృష్టం ! ఏం అదృష్టం ! కూకుంటే లేవలేక తన్నుకులాడే అదృష్టం ! సరే కాని, నీ వెక్కడనుంచి వత్తుం డావురా అంటే జవాబు చెప్పావు కావే. ఏం ? సెప్ప కూడదా ?

బొజ్జయ్య :– ఏం లేదురా. అక్కడ అది జరుగుతుంటే కొం చెం సేపు సూత్తామని యెళ్లా.

చిక్కప్ప :– ఎక్కడ ?

బొజ్జయ్య :– అక్కడే. ఎఱగవు? మనూళ్లో నాటకం రీహాల్సు.

చిక్కప్ప :– ఏమిటి? రిహార్సల్సా ?

బొజ్జయ్య :– ఆఁ, అదే, రీహాల్సు, అది సూద్దామని యెళ్ళా,

మళ్లా ఆ నాటకంనాడు సూట్టానికి ఈలు టుందో లేదో ఆని.

చిక్కప్ప :- డబ్బుంటుందో లేదో అనా ? లేక యీలుంటుందో లేదో అనా ?

బొజ్జయ్య :- అదేలే. డబ్బే అనుకో; (మెల్లని గొంతుతో) నీ యింటిదాని వంటిది కాదుగా మాయింటిది. దమ్మిడి పోతే పానం పోతుందంటుందిరా.

చిక్కప్ప :- అయితే, నీ విప్పుడు రీహాల్సునుండి వత్తుండావా?

బొజ్జయ్య :- అవును, లేకపొతే యీ రాత్రివేళప్పుడు యింకెక్కడికి పోతాను నేను ?

చిక్కప్ప :- అయితే, వాళ్లు వాకిండ్లు యేసుకుని రీహాల్సు సేత్తుండారే. ఎవ్వరినీ రానియ్యటంలేదే వాళ్లపనికి బంగమాతుందని. నీ వెల్లా సూడగలిగావ్ ?

బొజ్జయ్య :- ఆఁ, నేను మాత్రం లోపలికెల్లానా యేంటి ?

చిక్కప్ప :- ఊఁ, మరేంసేశావ్ ?

బొజ్జయ్య :- వాళ్ళు లోపల రీహాల్సు సేత్తుంటే, ఆ కిటికీల సందుల్లోంచి కూస్తి కూస్తిగా కూస్తి కూస్తిగా సూశా.

చిక్కప్ప :- బలేపనే సేశావే! అయితే యెల్లాఉంది నాటకం ?

బొజ్జయ్య :- ఎల్లా ఉందని సెప్పను ? బలే మజాగాఉంది. మొదటిరకం మిరపకాయిలాగా ఉంది.

చిక్కప్ప :- అంటే యేంటో నాకర్దం కావటంలేదు నీ కయిత్తం బాసలో సెపితే.

బొజ్జయ్య :- కయిత్తం బాసకాదు. నిజంగా అల్లాగే ఉంది. ఎందుకంటావా ? ఏమి ఉద్రేకం మాటలు ! ఏమి మాఠ

ప్రతాపం పద్యాలు! ఏమయిన సక్కనైన పాటలు!
అబ్బబ్బ! అది నీవుకూడా సూసే తీరాలిరా.

చిక్కప్ప :- ఆఁ, అంత బాగుందా?

బొట్టియ్య :- ఏం సెప్పను! అది సూసినంతసేపు నేనుకూడ ఆ నాటకంలోసేరి, యీ రుడియేసకంయేసి (కొంచెముగ యెగురుచు) యెగిరితే బాగుంటుం దనిపించింది. మనంటోళ్లని యీ నాటకంలో యెయ్యనీయరనుకో; కాని నాకు మాత్రం మనసులో ఒక పెద్దకోరి కుందిరా.

చిక్కప్ప : ఏంటది?

బొట్టియ్య :- ఏం లేదు, మనంకూడ యిసుమంటి నాటకం ఒకటి యెయ్యాలని.

చిక్కప్ప :- ఓయబ్బో! మనమే! నిజంగానే!

బొట్టియ్య :- నిజంగానే. మనం మాత్రం ఒకప్పుడు ఆడి పాడి యెగిరినోళ్లం కాదు? ఏది? నీకు జ్ఞాపకంలేదా ఆ పాట? (వేళ్ళతో చిటికెలు వేయుచు) పాట

పల్లవి॥ మోచ్చము కలదండీ మనలకు మోచ్చము కలదండీ ॥ మో ॥

చిక్కప్ప :- ఓహో! ఆ సాతులయ్యోరు రాసిచ్చిన పాట! అదైతే నేను బోపాడుతూ ఉండేవాడినిగా ఆ రోజుల్లో! అదైతే నాకూ యిట్టమే, పాడుతా యిను (మొరటుగ నాట్యము చేయుచు పాడుదురు.)

చరణం : 1 : పాపపుణ్యముల భేదము తెలుగుచు
పాపభీతిచే బరగినవాడు

సంఘమునందలి సకల దోషములు
సమసి యెల్లరును సుఖపడునాడు || మో ||

బొజ్జయ్య : 2 : సోమరితన మడుగంటిననాడు
పామరవిద్యయు వరలిననాడు
గ్రామ పరిశ్రమ లెదిగిననాడు
గ్రామము లున్నతి గాంచిననాడు || మో ||

చిక్కప్ప : 3 : పాపపు పశుబలి బాపిననాడు
బాల్యవివాహము మాన్పిననాడు
క్రూరశుల్కముల గూల్చిననాడు
సాంఘికదోషము సమసిననాడు || మో ||

బొజ్జయ్య : 4 : మత్తువస్తువుల మానిననాడు
చిత్తశుద్ధితో చెలగిననాడు
వైరభావమును వదలిననాడు
చేరి శాంతముగ చెలగిననాడు || మో ||

చిక్కప్ప (తెరవంకచూచి) అదుగో మా గొడ్లు ఒకదాన్నొకటి గుచుకుంటున్నాయ్. పాడుగొడ్లు. యహా, యహా. నిన్ను కొయ్య. (అని బొజ్జయ్యను చేతితో లాగుకొని వడిగ నిష్క్రమించును.) (తెరపడును.)

# ఎనిమిదవ రంగము



[కళావతి గృహము. ఒక గదిలో వీణను వాయించుచు ఈ క్రింది పాటను పాడును.]

## పా ట.

(విమోహనకల్యాణి-త్రిపుట)

1. మరచితివా నను మహేశ్వరా! నిను మరతునె ఓ దేవా!
ప్రీతిగ నిన్నే వినయాననయై ప్రార్థించెద గాదే ॥ మ ॥
2. కళయే నా మదికిన్ సఫలమౌ కావగరావా నన్ మహేశా
దీనజనావన బిరుదము నీకై కోరక కలదా ఓ మహేశా
ఇదేగదా నీ నటరాజత్వము నాట్యకళావలికిన్
ఈ పురమందిర నాటకమందున నటియింపగలేనా ॥ మ ॥
3. జీవితఆశయమే నటనమని వలచిన నా బ్రతుకున్ విషములో
కల్పెదవా ఓ దేవ నీవే యీ నటికేలను బాధ దేవా
సదా నినే నా మదిలో దలపన్ మార్గము జూపవుగా
ప్రీతిగ నిన్నే వినయాననయై ప్రార్థించెద గాదే ॥ మ ॥

కేశవయ్య :- (ఆసక్తితో ప్రవేశించి ఒక కుర్చీపై కూర్చుండి) అమ్మాయీ, యీ సంగతి విన్నావా నీవు ?

కళావతి :- ఏమిటి తాతా ?

కేశవయ్య :- ఇప్పుడే నాకు ఒకాయన చెప్పిపోయాడు.

కళావతి :- ఏమిటది ?

కేశవయ్య:- విశ్వనాథరావుగారు, మరికొందరు కలసి యివ్వాళ్లే మదరాసు వెళ్లారట.

కళావతి :- ఓహో ! దేనికి వెళ్లారట ?

కేశవయ్య :- వాళ్ళ నాటకానికి నాట్యసార్వభౌమ శివరామ ప్రసాద్ గారినేకాక, యింకా యెవరినైనా ఒక మంత్రిగారిని కూడా ఆహ్వానింపదలచుకున్నారట ! ఎవరైనా మంత్రిగారు

వస్తే యింకా శోభగా ఉంటుందికాదూ ? అందుకని యీ విధంగా చేస్తున్నారట.

కళావతి :- (విచారముగా) అల్లాగా ! మనకు యీ నాటకంలో పాల్గొనే భాగ్యం యింతవరకు కలుగలేదుగద ! ఇక ముందైనా కలుగుతుందో లేదో చెప్పలేకుండా ఉన్నాం. మన అదృష్టమంతా ఆ భుజంగరావుగారు మొదలైనవారు చేసే కృషిమీద ఆధారపడి ఉంటుంది.

కేశ :- అల్లా దిగులుపడకమ్మ, దిగులుపడకు. అటువైపు యెంత బలగముగాడి పనిచేస్తున్నారో, యిటు మనవైపు కూడా అంత బలగముగానే పనిచేస్తున్నారు. వాళ్లే యేదో విధంగా మనపని సానుకూలపరచుకొని వస్తారు. నీవు కేవలం నాట్యకళను నమ్ముకొనే పాటుపడుతున్నావు. ఆ కళనే ప్రత్యక్షదైవముగా నమ్ముకొని ఆరాధిస్తున్నావు. అటువంటప్పుడు నీకు ఆ కళామూర్తి యెందుకు తోడ్పడకుండా ఉంటాడు ? మనం ధైర్యంగా ఓర్పు వహించిఉంటే, దానంతట అదే అంతా సానుకూల పడుతుంది.

కళా :- (విచారముతో) ఆరోజున ఆ మంత్రిగారే వస్తే యెంత వైభవంగా ఉంటుందో ఆ నాటకరంగం !

కేశ :- అవును, జనం కిటకిట లాడుతారనే హాలులో ఆ రోజు పోలీసు బందోబస్తుకూడ పెట్టిస్తారట ! మహావైభవంగా ఉంటుంది.

కళా :- నాకు నాయికాపాత్రే కావాలని లేదు; మరొక పాత్రైనా సరే, వేసి, మన పురమందిర నిర్మాణంలో నేను

కూడ కొంత నాట్యకళాసేవ చేస్తానంటే, మీరంతా పట్టినపట్టు విడవకూడదని నన్ను మొదటినుంచి నొక్కి పెడుతున్నా రామెను. ఈ విధంగా నొక్కిపెట్టి యితరులు కళలు ఒక స్వేచ్ఛలేని బానిసగా, తమచేతిలోని ఒక కీలుబొమ్మగా, అణచిపెడితే ఆ కళ యెన్నటికైనా వృద్ధికి రాగలదా? ఎన్నటికైనా ఆకళ సంపూర్ణమైన సౌభాగ్యంతో గట్టెక్కి స్వర్గ సౌందర్యం చూపించగలదా? నేను రంగస్థలమెక్కినప్పుడు ప్రేక్షకమహాశయులే యెవరి కళానైపుణ్యం మేలువంటిదో నిర్ణయింపగలరు కాని, కేవలము ఆ పుష్పలతతో పోటీపెట్టు కొని, నాకు నాయికాపాత్రే కావాలని భీష్మించుకుని యిం టిలో కూర్చున్నంతకాలము లోకమునకు నా కృషియేమి తెలుస్తుంది? అందువలన యిప్పుడు యింతమంది మన తర ఫున మాట్లాడుతున్నప్పటికీ, వాళ్ళు కళాభిమానంతో మాట్లా డుతున్నారని లోకం అనుకోక పోవచ్చు. కళాసేవకుని హృదయములో బాధించుచుండు ఆ ఆవేదన కళాభిమానులే తెలిసికొనగలరు గాని సామాన్యులెట్లు తెలిసికోగలరు?

కేశవయ్య :- అబ్బ! అవన్నీ నీవు మనసులో పెట్టుకొని బాధ పడొద్దమ్మా. మనవైపు వాళ్లుకూడ సామాన్యులు కారు గదా. వాళ్ళుకూడా మనకొఱకు యేదో తగిన ఉపాయం ఆలోచిస్తూనే ఉంటారు. నీ కళాసేవకు తగిన ఫలితం నీకు ఆ భగవానుడు యివ్వకపోడు, శాంతించు. (తెరవంక చూచి) నీవు పాడుకుంటూ ఉండు. ఇప్పుడే వస్తాను. ఎవరో మాట్లాడటానికి వచ్చినట్లున్నారు. (నిష్క్రమించును)

కళావతి :- (దీనముగ తనలో) దేవాదిదేవా! కళాస్వరూపా! నాకీభాగ్యమును దయచేయఁజాలవా? నేను యీ సంఘమున బుట్టినందున లోకులు నన్ను అన్యథా తలంచుచుందురే గాని, నాలో యిమిడిగల వెలుఁగుచున్న ఆ కళాశక్తిని గమనింపరుగదా. నా శీలమును నా విద్యాబుద్ధులను గమనింపగల సర్వాంతర్యామివి నీవే నన్ను విడనాడినవో, నాకింక గతియేమి దేవా! మా గ్రామమునకు, మా జన్మస్థలమునకు, నేనును ఉత్తమభక్తితో సేవచేయ గలుగునట్లు దీవింపవా! పరాత్పరా! జీవరక్షకా!

పాట.

(ఏక్ తేరాసహారా......వలె)

1. నన్ బ్రోవు మహేశా। నన్ బ్రోవు మహేశా॥
మొరవినగ నీవేగా నను పాలనసేయ ॥ న ॥

2. పురసేవకు నేనెంతో పరితాపము పడగా
పురసంహార నీ విటులన్ మరచెదవా
నా చేసిన పలుపూజలె బూడిదపాలా
నటరాజ యిటు నీవె నన్ కాపాడగ రావ ॥ న ॥

3. వరదా, వరదా
వరదాయక యిక లేరుగ నన్ గాచెడువారే
ఈ యూరెని నేనాయిక నైఖ్యాతిని జెందా
అపకీర్తి యూ భుజంగరాయా। పుణ్యచరిత్ర!
నాభక్తి శక్తికేమిఫలం బీవె మహేశా? ॥ న ॥

(తెర పడును.)

# తొమ్మిదవ రంగము

[గోపాల్ గృహము. అతడు యేదో వ్రాసికొనుచుండును. తెర లేచును. అంతట గణేశ్ తెరలో నుండును.]

(తెరలో) గోపాల్, గోపాల్

గోపాల్ :— (తలయెత్తి) హలో గణేశ్, లోపలికిరా.

గణేశ్ :— (ప్రవేశించి కుర్చీలో కూర్చుండి) ఏమిటి వ్రాస్తున్నావు?

గోపాల్ :— ఏవో లెక్కలు చేస్తున్నాను.

గణేశ్ :— సెలవలలో కూడా చేయవలసిందేనా లెక్కలు?

గోపాల్ :— ఎవరికోసం? పరీక్షలు ప్యాసయ్యేటంతవరకు చేయవలసిందే, నీవు చరిత్ర చదివినట్లు.

గణేశ్ :— ఆ పైన?

గోపాల్ :— ఆ పైన యెక్కడైన మేష్టరు పనికి చేరితే లెక్కలు చెప్పాలి. లేకపోతే వానికి పూర్తిగా స్వస్తి చెప్పొచ్చు-

గణేశ్ :— సరే బాగానేవుంది. ఏదీ కట్ట యెక్కడ పెట్టావు?

గోపాల్ :— ఏం కట్ట? పేకలా?

గణేశ్ :— అవును, అవే. కాసేపు ఆడుదాం. ఇవ్వాళ్ళ కనీసం పది రూపాయలు నీవైనా గెలవాలి లేదా నేనైనా గెలవాలి.

గోపాల్ :— నీకేం? ఎక్కడెక్కడో ఆడి ఓడిపోయి వస్తావు. అది నాదగ్గర గెల్చుకోవాలంటావు. అయినా, యీ సెలవలలో నీకీ పేకపిచ్చి చాలా యెక్కువైపోయింది. ఇదివరకెన్నడూ నీకింత పిచ్చి ఉండేదికాదు. చివరకి యీ పిచ్చి

నిన్ను యెక్కడికి చేరుస్తుందో యేమో? ఇప్పటి కేమైనా కూడబెట్టావా దీనివల్ల? నీ వెల్లాగైనా జాగ్రత్తపడి త్వరలో యీ పిచ్చిని వదలుకోవాలి. లేకపోతే చెడిపోతావు.

గణేశ్ :- (తనలో) ఏమబ్బా! వీడివ్వాళ్ళ యింత నిక్కచ్చిగా అడుగుతున్నాడు! చెడిపోతావు అంటున్నాడు! ఇది యెక్కడికి చేరుస్తుందో అంటున్నాడు! ఇందులో వ్యంగ్యార్థమేమీ లేదుగదా. నేను యీ చీట్లకోసం చేసిన ఆ పాడు దొంగతనం వీనిచెవిని పడలేదుగదా.

గోపాల్ :- సర్లే, కొంచెంసేపుండి ఆడుదాం గాని యివ్వాళ్ళ ఊళ్లో యేమైనా చెప్పుకోదగిన విశేషాలున్నాయా?

గణేశ్ :- విశేషాలకేం? కావలసినన్ని ఉన్నాయి.

గోపాల్ :- ఏమిటవి? మన ప్రకాశ్ వాళ్లను గురించేనా?

గణేశ్ :- అవును.

గోపాల్ :- అడగటం మరచిపోయాను. నీవు వేసిన మంత్రం మోహన్‌మీద యేమైనా పనిచేసిందా?

గణేశ్ :- ఏమీ పనిచేసి నట్లులేదు.

గోపాల్ :- మరి, నీవు అంతగా వాళ్ల నాన్నతో వానిమీద ఉన్నవీ లేనివీ యెన్నెన్నో కల్పించి చెప్పావుగా.

గణేశ్ :- అవును, కాని ఆయన వానినేమీ మందలించినట్లు లేదు. ఒకవేళ గ్రామసేవకేగదా నటిస్తున్నది అని ఊరుకొని ఉంటాడు. లేకపోతె ఆయన కీనాటకాలంటే సరిపోవు.

గోపాల్ :- అయితే, మోహన్ యథాప్రకారంగా రిహార్సల్సుకు వెళుతూనే ఉన్నాడా?

గణేశ్ :- ఆహా! నిరాటంకంగా నెడుతున్నాడు, నిరాక్షేప
ణగా వస్తున్నాడు. (విచారముతో) మన మంత్రి పార
నప్పుడు యేం చేయగలం?

గోపాల్ :- విశ్వనాథరావుగారు వాళ్ళు యివ్వాళ్లే మదరాసు
నుంచి తిరిగి వచ్చినట్లున్నారే?

గణేశ్ :- ఆ, వచ్చారు. వాళ్ళూ వచ్చారు వీళ్ళూ వచ్చారు.

గోపాల్ :.. వీళ్లెవరు?

గణేశ్ :- ఓహో! నీకా కథంతా వివరంగా తెలియదు
కాబోలు! విశ్వనాథరావుగారు వాళ్ళు మదరాసు వెళ్ళి
నట్లు తెలిసి, తరువాత బండిలోనే యెవ్వరికీ చెప్పకుండ
భుజంగరావుగారు వాళ్ళుకూడ వెళ్లారట!

గోపాల్ :- ఎక్కడికి? మదరాసుకే?

గణేశ్ :- అవును.

గోపాల్ :- అయితే, వాళ్ళెవరికీ చెప్పకుండా పోతే, నీకెల్లా
తెలిసింది?

గణేశ్ :- వాళ్లు మళ్లీ తిరిగి వచ్చిన తరువాత, అనగా, యివ్వా
ళ్ళనే నాకుకూడా యీ కథంతా తెలిసింది. అంతే కాని
వాళ్లు వెళ్ళేటప్పుడే కాదు.

గోపాల్ :- అయితే, వాళ్లుకూడ మదరాసుకు దేనికెళ్ళారు?

గణేశ్ :- దేనికా? చెపుతా విను; బలే తమాషాగా ఉంది
జరిగినదంతా?

గోపాల్ :- ఊఁ! అయితే త్వరగా చెప్పు యేమి జరిగిందో.

గణేశ్ :- మదరాసులో విశ్వనాథరావుగారు వాళ్ళు యేమం

త్రిని కలుసుకొని మాట్లాడారో, ఆదే మంత్రి దగ్గరకే భుజంగరావుగారు వాళ్లుకూడ వెంటనే వెళ్ళి మన ఊళ్లో యీ నాటకం మూలంగా జరిగిన భేదాభిప్రాయాలన్నీ గుచ్చెత్తి చెప్పారట ?

గోపాల్ :— అబ్బా ! బలే తమాషా చేశారే ! తరువాత యేమి జరిగిందట ?

గణేశ్ :— మంత్రిగారు వారి ఉభయుల విన్నపములు సవిస్తరముగవిని, ఆ పైన వాళ్లను వేరువేరుగా పిలిపించి, తీవ్రంగా యీ సలహా చెప్పారట.

గోపాల్ :— సలహా చెప్పారు ! అయితే ఆయనగారు వచ్చి నాటకానికి అధ్యక్షత వహించటానికి ఒప్పుకోలేదా ?

గణేశ్ :— ఎల్లా ఒప్పుకుంటాడు ఊళ్లో యిన్ని భేదాభిప్రాయాలున్నట్లు తెలిసినప్పుడు ?

గోపాల్ :— అయితే యేమని సలహా యిచ్చాడట ! మీరు యీ నాటకం వెయ్యండి. అయితే యెంత వ్యాపారస్థలమైనా ఒక్క నాటకంవల్ల మీ గ్రామంలో 20 వేల రూపాయలు వసూలు చేయటం చాలాకష్టం. అందువల్ల భుజంగరావుగారి పక్షంవారుకూడా వారికి కావలసిన నటకులతో అదే పురమందిరం మరమ్మత్తు కోసము మీ గ్రామంలోనే మరొక నాటకం వేస్తారు. నేను వాళ్లకు నచ్చచెప్పాను. వాళ్లు ఆ పద్ధతి కొప్పుకున్నారు. మీ కిప్పుడు చెప్తున్నాను. మీరుకూడా ఒప్పుకోండి. లేకపోతే చాలా కష్టాలు కలుగుతాయి. ఎవరి నాటకంవాళ్లు శాంతంగా జరుపుకొని, మీరు

చేతనైనంత పైకం వసూలుచేయండి. అప్పటికి మీకింకా పైకం కావలసివస్తే దానిని గురించి నేను ఆలోచిస్తాను. అందరు యేకమైనా సరే, లేదా యేపక్షానికి ఆ పక్షం వారైనా సరే ఆ పురమందిరంలో చేరి సగం భాగం ఒక సంవత్సరంలో మరమ్మతు చేయించండి. దానికి ప్రారంభోత్సవం చేయటానికి మీరు రమ్మంటే నేనప్పుడు సంతోషంగా వస్తాను. ఇప్పుడుమాత్రం మీ నాటకాలకు అధ్యక్షత వహించటానికి కావలెనంటే మీ జిల్లాకలెక్టరుకు వ్రాస్తాను. ఆయనవచ్చి అధ్యక్షత వహిస్తాడు" అని తీవ్రంగా చెప్పాడట.

గోపాల్ :— బలేబాగా తీర్చాడే పిల్లతగవు! అయితే విశ్వనాథరావుగారుకూడ ఆ పద్ధతికి ఒప్పుకున్నాడటనా?

గణేశ్ :— ఒప్పుకోకేం చేస్తారు మంత్రిగారు చెపుతుంటే? అందువల్ల వాళ్లు వీళ్ళు మదరాసునుంచి యివ్వాళ్లతిరిగివచ్చారు.

గోపాల్ :— అయితే మొదటినాటకం యింకా యెన్నాళ్లుంది?

గణేశ్ :— ఇంకా పదిరోజు లుంది. అందుకనే యిప్పటినుంచే చాటింపులు, టిక్కెట్లు యిచ్చి పోవటాలు ఆరంభించారు. అవునుగాని, మనమాటల ధోరణిలో నీవసలు చీట్లపేక తేవటమే మరచిపోయావే! పోయి తీసుకురా యిప్పుడు. కనీసం ఒక్కఆటైనా ఆడుదాం.

గోపాల్ :— ఇక్కడెందుకులే; మానాన్న చూస్తాడు. అల్లా ఆ గదిలోకి పోదాం పద. అక్కడైతే యే తొంకర ఉండదు.

[ఇంతలో యిన్‌స్పెక్టరు ఒకపోలీసు ప్రవేశింతురు.]

పో. ఇ :- (గణేశ్‌తో) నీవేనా గణేశ్ ?

గణేశ్ :- (తనలో) నేను చేసిన దొంగతనం వీళ్ళకు తెలిసిందా యేమబ్బ ! పాడుపెక ! (ప్రకాశముగ, అవును నేనే, నాతో యేమి పని ?

పో. ఇ :- పని ఉన్నది. మాతో పోలీసు స్టేషనుకు నడువు.

గణేశ్ :- నేనా ? మీరు పొరబడుతున్నారేమో ! నే నెందుకు నడవాలి ?

పో. ఇ :- ఏమీం పొరబడటంలేదు. ముందు స్టేషనుకు నడువు. అంతా అక్కడ చెప్తాము.

గణేశ్ :- ఇదేమి అన్యాయం !

పో. ఇ :- ఏమీా అన్యాయంలేదు. ముందు నడు. తరువాత అంతా తెలుస్తుంది.

[ఇన్‌స్పెక్టరుతో గణేశ్ నిష్క్రమించును.]

గోపాల్ :- (తనలో ఆశ్చర్యముతో) వీడేదో తంటాచేసినట్లున్నాడు ! నేనుకూడా పోయి అసలు విషయమేమిటో చూస్తాను. (నిష్క్రమించును.)

# పదవరంగము

[కోటయ్య గృహము. పంచకట్టుకొని, ఒక సాదా బనీను వేసికొని ప్రవేశించి ఎదురుగ పెట్టె ముందు కూర్చుండి, పెట్టెకు నమస్కరించును. అంతట పెట్టెలోనుండి ఊదుకడ్డీ సగము అయిపోయినది తీసికొని వెలిగించి వడివడిగా పెట్టెచుట్టు మూడుసార్లు హారతివలె త్రిప్పి వెంటనే దానిని నేలకు రాచి ఆర్పివేయును. దానిని పెట్టెలో ఉంచును. పెట్టెపై ఒక పుస్తకముంచి దానిలో సిరాబుడ్డిలోముంచిన కలముతో నేదో వ్రాయుచుండును. కళ్ళకు పాతదికపు కళ్ళజోడు పసులుగా ఉండును ఆతని బొడ్డున యినుపపెట్టె తాళంచెవులగుత్తి వ్రేలాడుచుండును. అంతట అతని తమ్ముడు 12 యేండ్లవాడు శంకర్ అనువాడు ప్రవేశించి కొంచెము దూరముగ కూర్చుండి పగిలిపోయిన పలకను చూచుచు యీ క్రింది పాటను పాడును.]

పాట.

(గేయము)

(బిలహరి — ఆది)

ప॥ ఆనందముతో నీ పదకమలము లనవరతము
దలతుము దేవా!

అ॥ తలతుముగా వలతుముగా యిలలో నీ మహిమలు
గనుగొని విని ॥ ఆ ॥

చ॥ చిలుకలు పలుకన్ పికములు పాడన్ శిఖులు నటింపన్
సుమములు విరియన్ ।

సకలము నీ సన్నుతితో సాదరముగ తమ విధులను
సలుపగ ॥ ఆ ॥

మా మనముల మానితమగు మార్గములనుగొనిచనుమా।

వాదములన్ భేదములన్ పాపము తాపము
కోపములను జన ॥ ఆ ॥

ధర కేలికవై నరమాత్రులచే పరసత్కృతులన్
నెరవేర్తువుగా ।

మరువక నీ వరసూక్తుల్ నిరతము
సద్గతినరయుటకొఱకై ॥ ఆ ॥

కోటయ్య :- (వ్రాసుకొనుచు) ఎక్కడిదిరా అబ్బాయ్ యీ పాట ?

శంకర్ :- (ముద్దుమాటలతో) మా మాష్టరుగారు చెప్పారు. మరే...ఇవ్వాళ్ళ అప్పచెప్పమన్నారు.

కోటయ్య :- ఊఁహూఁ, అయితే బాగా నేర్చుకో.

శంకర్ :- (మెల్లగాలేచి కోటయ్య దగ్గరకువెళ్ళి ముద్దుగా) నాన్నా......నాన్నా......

కోటయ్య :- (తలయెత్తకయే) ఏమిట్రా ?

శంకర్ :- మరే......మా మాష్టారిగారు పుస్తకంలో చూచి రాత రాసుకురమ్మన్నారు. రాసుకోటానికి నాకు పెనసలే లేదు. ఒకటి కొనియ్యి నాన్న.

కోటయ్య :- (ముద్దుమాటలతో వీపు నిమురుతూ) పెనసలెందుకురా పిచ్చివాడా హాయిగా పలకా బలపం ఉండగా ? చక్కగా బలపంతో పలకమీద వ్రాస్తే యెంతైన చూచి రాత్ర రాయొచ్చు. ఏమిటి ? చూడు, కానీ పెడితే మూడు బలపాలిత్తారా ? కాని, పెనసలు కొనుక్కోవాలంటే యెంత్ర పెట్టాలో తెలుసా ? రెండణాలు పెట్టాలి. రెండణాలకీ

యెన్ని కాన్లు చెప్పు ? ఏమిటి ? ఎన్ని కాన్లు ?

శంకర్ :- (వేళ్ళు లెక్కించి) రెండణాలకా?...ఎనిమిది ?

కోటయ్య :- మరి యెనిమిది కాన్లెందుకు ఖర్చుపెట్టాలి చెప్పు. ఏమిటి ? అదీకాక పెనసలును చూస్తే యెవరైనా పిల్లలు తెలియకుండా యెత్తుకు పోతారు. కాని బలపాన్ని యెవ్వరు యెత్తుకుపోరు...కదు ? అందుకని హాయిగా బలపంతో రాసుకో. ఏం ?

శంకర్ :- కాదు నాన్నా, పెనసలు తెచ్చుకోకపోతే మా మాష్టారుగారు కొడతానన్నారు నాన్నా.

కోటయ్య :- ఏమీ కొట్టడులే. ఒకవేళ కొట్టొస్తేనే నీ పెనస లెక్కడో పోయిందని చెప్పు. ఏం ? సరేనా ?

శంకర్ :- అబద్ధం చెపితే, మా మాష్టారుగారు యింకా కొడ తారు నాన్నా.

కోటయ్య :- ఏమీ కొట్టరులే. ఏమిటి ? ఇదుగో చూడు, పెద్ద బలపం తీసికెళ్ళకు బడికి. (అని ఆతని చేతిలోనున్న పెద్ద బలపమును తీసికొని సందుగపెట్టెలో పెట్టును.) ఎవరన్నా యెత్తుకుపోతారు. చిన్నపిక్కె ఒకటి తీసుకు పో. ఏం?

శంకర్ :- ఇదుగో నాన్న...సూరయ్యగారబ్బాయే చక్కని బూడుసులు కొనుక్కున్నాడు నాన్న. అవి యేసుకుని బడి కొస్తాడు. ఎంతో బాగున్నాయ్ ! నాకు కూడా కొనివ్వవు నాన్నా ?

కోటయ్య :- (ఆశ్చర్యముతో బొమ్మపై చేయి ఉంచుకొని)

ఏమిటి ? బూడసులే ! ఓరి పిచ్చివాడా ! ఎక్కడన్నా పిల్లలు బూడుసు లేసుకుంటారు ? అసలు బూడుసులేసుకుని మాష్టరి గారి దగ్గరకు పోవచ్చు ? తప్పుకాదు ?

శంకర్ :- లేదులే నాన్న, బళ్లో యిప్పుతాలే.

కోటయ్య :- ఊఁ ! బళ్ళో యిప్పుతే యెవరైనా యెత్తుకు పోరూ ? చిన్నపిల్లలు బూడుసులేసుకుంటే కాళ్లు అరిగి పోతాయ్. తెలిసిందా ? ఇంక హాయిగా బడికిపోయి చదువుకో. ఏం ?

శంకర్ :- పోసి ఒక కానీ యివ్వ నాన్న.

కోటయ్య :- ఆఁ ! కానీయా ! ఎందుకు కానీ చిన్నపిల్లవాడికి? పెద్దవాళ్లకైతే కాన్లు కావాలిగాని నీ కెందుకు చెప్పు. నీదగ్గరుంటే యెక్కడైనా పారేసుకుంటావు. నా దగ్గర దాస్తాలే.

శంకర్ :- దాయటానికి కాదు నాన్న. పిప్పరమెంటు బిళ్ళలు కొనుక్కుంటా.

కోటయ్య :- ఎక్కడ కొనుక్కుంటావు ?

శంకర్ :- మా బడిదగ్గిర.

కోటయ్య : బడిదగ్గరే !

శంకర్ :- ఏం బడిదగ్గరైతే ?

కోటయ్య :- అమాంతంగా ఆ పిల్లలు యీ పిల్లలువచ్చి అవి కాసినీ యెగరేసుకుపోరు ! ఏంటి ? నే చెప్పింది నిజమేనా ? (తెరలో) కోటయ్యగారూ......

కోటయ్య :- (ఆలకించి తనలో) ఎవరది ? (తెరవంకచూచి) ఓహో ! శ్యామారావుగారా ! లోపలికి దయచేయండి.

(శ్యామారావు ప్రవేశించును. అంతట యిరువురుక్రింద కూర్చుందురు. శంకర్ నిష్క్రమించును.)

కోటయ్య: — ఏదో పనిమీద వొచ్చారు ? ఏమైనా వడ్డీక కావలెనా ? అమ్మాయి పెండ్లేమైనా తలపెట్టారా ?

శ్యామారావు :— (చిఱునవ్వుతో) లేదు కోటయ్యగారు. దానికికాదు వచ్చింది. మన ఊళ్ళో పురమందిరం ఒకటి మరమ్మతు చేయించటానికి ఒకనాటకం వేస్తున్నారు, మీకు తెలుసుగా ?

కోటయ్య :— ఆ...ఆ... తెలియకేం ? అయితే యేమి నాటక మండి ?

శ్యామారావు — వీరవిహారం.

కోటయ్య :— ఓహో ! అయితే బలే నాటకమే అన్నమాట !

శ్యామారావు :— అవును, ఆ పురమందిరం మన గ్రామానికి చెందినదే కాబట్టీ, దానివలన ప్రయోజనం మనమందరం అనుభవిస్తాము కాబట్టి. మీవంటి సంపన్నులంతా మీ శక్తి కొలది నాటకం టిక్కెట్లు కొనాలి. (సంచినుండి తీసి చూపుచు) ఇవిగో 10 రూపాయల టిక్కెట్లు; ఇవి 5 రూపాయల టిక్కెట్లు.

కోటయ్య :— (యోచించి) అయితే పావలా టిక్కెట్లు లేవా అండి ? సినిమాల కుంటాయే ?

శ్యామ : లేవు, సినిమాల విషయం వేరు.

కోటయ్య :— (యోచించి) పోనీ, ఒక అర్ధరూపాయి యిస్తాను ఒక టిక్కెట్టు యిప్పించండి.

శ్యామ :- అయ్యో! అసలు అర్ధరూపాయి టిక్కెట్లు లేనే లేవు. మీ రేమిటి? అర్ధరూపాయి టిక్కెట్టు తీసికోవటమేమిటి? మీవంటివాళ్ళు కనీసం 5 రూపాయల టిక్కెట్టైనా తీసు కోవాలి. అంటే నూటికి 15రోజుల వడ్డీ యివ్వాలన్నమాట?

కోటయ్య :- అబ్బో! అయిదురూపాయల టిక్కెట్టే! బాబు బాబు వద్దు వద్దు! నా మీద అంత బరువెయ్యకండి చచ్చి పోతాను. నన్నేదో దయుంచి తేలికగా పోనియ్యండి మీకు పుణ్యముంటుంది; మీ పేరెప్పుడు తలుచుకుంటూ ఉంటాను.

శ్యామ :- (యోచించి చిరునవ్వుతో) సరే మీయిష్టమొచ్చిన టిక్కెట్టే తీసుకోండి; మీరంత ప్రాధేయపడుతుంటే యింక నేనేం చెప్పగలను? ఏటిక్కెట్టివ్వమంటారు?

కోటయ్య :- అన్నిటికంటె చౌక టిక్కెట్టేదన్నారు?

శ్యామ :- ఒక రూపాయి టిక్కెట్టు,

కోటయ్య :- ఇంక అంతకంటె తక్కువ బేరము యేమీ లేదంటారా?

శ్యామ :- ఇంకా అంతకంటే తక్కువది కావలెనా? చాలా విచిత్రంగా అడుగుతున్నారే!

కోటయ్య :- (అయిష్టతతో పెడముఖముగ ఎడమచేయిచాచి) అయితే ఆ రూపాయి టిక్కెట్టే ఒకటివ్వండి.

శ్యామ :- (ఒకరూపాయి టిక్కెట్టు పుస్తకమునుండి చింపి యిచ్చును.)

కోటయ్య :- (టిక్కెట్టు పుచ్చుకొని రెండువైపుల త్రిప్పి చూచు కొని) పైకం కేసిత్తాలేండి.

శ్యామ :- (యోచించి) సరే. (తనలో) అందరూ యిటువంటి మహానుభావులే ఉంటే యింక ఊరు గొడ్డుపోవలసిందే. పైపెచ్చు యీ ఒక్కరూపాయి కొరకు మళ్ళా రేపు రావలెనట ! (అనుచు నిష్క్రమించును.)

కోటయ్య :- (ఆశ్చర్యముతో ముందుకువచ్చి నడుముపై చేతులుంచుకొని శ్యామారావు వెనుకనే చూచుచు) మా పిల్లోడికి అంతసేపటినుంచి బ్రతిమాలుతున్నా ఒక్క కానీ యివ్వటానికి వెనకాడుతూ ఉంటే, యిట్టేవచ్చి, యీయన ఒక చిటికెలో ఒకరూపాయ టెక్కట్టు బలవంతాన రుద్ది పోయాడు గంద ! ఏమి ఆచ్చర్యం ! ఏమి ఆచ్చర్యం ! ......కాని, యీయనకు ఆ రూపాయి యిచ్చినప్పుడు చూద్దాంలే. (అని బిరబిర మరియొక దిక్కు నిష్క్రమించును. తెరపడును.)

# పదకొండవ రంగము

[నాటకరంగము. కుర్చీలపై జిల్లాకలెక్టరు, నాట్యకళా సార్వభౌమ శివరామప్రసాద్ కూర్చుండియుందురు. వారి యెదుటనున్న జల్లపై రెండు పూలదండలుండును. రంగము ముందువైపున పుష్పలత రాజపుత్ర రాణివేష ముతో నిలచియుండును. తెరలేచును. అంతట ఆమె యీ క్రింది పద్యమును పాడును.)

పుష్పలత :-

సీ. శాంతించుగాత దేశంబెల్ల వేధించు
        నన్యోన్యవైర మహాగ్నికీల ।

సమరరంగాన నిశ్చల సామరస్యంబు
సకలవర్ణ మతాది శాఖలందు।
వృద్ధియగుగాత దారిద్ర్యంబుఁ బోద్రోలి
బివ్యత్వమిచ్చు నార్థికపథంబు।
వెలుగొందుఁగాత వీరుల కర్మవీరంబు
రాజ్యాధిపతుల స్వార్థంబు నణప॥

గీ. ధరణి శాంతంబు సౌఖ్యంబు వఱలుగాత।
ఐకమత్యంబు మన భూమి నలరుగాత।
ఆయురారోగ్య భోగభాగ్యాన్వితముగ
భరతమాత శుభంబుల నరలుఁగాత!

కలెక్టరు: (లేచి తెరవంకచూచుచు) మహాజనులారా! ఈ ప్రదర్శనమునకు అధ్యక్షునిగా నుండుమని కోరి గౌరవించి నందులకు యీ సంఘమువారికి నా ధన్యవాదములు.

ఈ ప్రదర్శనమును యింత జయప్రదముగా జరుపగలిగి నందులకు యీ సంఘమువారిని నేను అభినందించుచున్నాను. ఈ వీరవిహార నాటకమునకు మీరు పదివేలరూపాయలు వసూలు చేయగలిగినందుకు చాల సంతోషము. కాని యీ పైకము మీ పురమందిర పునర్నిర్మాణమునకు చాలదను విషయము మీ కెల్లరకును తెలిసియే యుండవచ్చును. అందుచేత మరి యొక నెలరోజులలో మీ గ్రామములోని మరి కొందరిచే ఒక నాటకము ప్రదర్శింపబడి, తక్కిన పైకము వసూలు చేయ బడును. దానికిని నన్ను అధ్యక్షత వహింపుమని కోరుటచే సంతోషముగ అందుకు సమ్మతించుచున్నాను. అది పూర్తి

మైన వెంటనే పురమందిర నిర్మాణము నారంభింపుడని కోరు చున్నాను.

మరియొక ముఖ్యమైన మాట. ఈ ప్రదర్శనమున పాల్గొనిన విద్యార్థుల నందరిని, నేను ప్రత్యేకముగ అభినందించు చున్నాను. ప్రతి సంవత్సరమును యెండాకాలపు సెలవలు యెంతమందికి వచ్చుటలేదు? కాని తక్కినవారివలె ఆ సెలవలను స్వసుఖములతో వృథాపుచ్చక, కేవల గ్రామాభిమానముతో నింతపాటుపడి సేవజేసిన, వీరు మనదేశమునందలి యువకుల కందరికిని ఆదర్శపాత్రియులై యున్నారు. (తెరలో కరతాళధ్వనులు.) ఈ విధముగ యే గ్రామమువారు ఆ గ్రామాభివృద్ధికై స్వార్థరహితముగ కృషిచేసినచో తప్పక మనదేశము సకలసంపదల కాశ్రయము కాగలదు. ఈ కార్యక్రమమున పాల్గొనినవారి నందరిని ప్రశంసించి, రాబోవు ప్రదర్శనమువారు కూడ యిట్లే జయప్రదముగ సాగింతురని సంపూర్ణముగ విశ్వసించుచు, యింతటితో విరమించుచున్నాను. (కూర్చుండును. తెరలో కరతాళ ధ్వనులు.)

శివరామప్రసాద్ : (లేచి తెరవంకచూచుచు) కళాభిమానులారా! నటీనట గణ్యులారా! నన్ను ప్రారంభోపన్యాసకునిగ నియమించుటచేత ప్రదర్శనము మొదట రెండు మాటలు చెప్పి నావిధిని నెరవేర్చితిని. కాని ప్రదర్శనమంతయు చూచిన పిమ్మట, మరల రెండుమాటలు చెప్పుట న్యాయమని తోచుటచే, మరల మీ సమక్షమున నిలుచున్నాను. అందుకు మీరు అన్యథా తలంపరని విశ్వసింతును.

ఈ ప్రదర్శనమున పాల్గొనిన వారందఱు తమతమ పాత్ర లక్షణముల బాగుగ అర్థము చేసికొని, రసపోషణముచేయుచు నటింపగలిగినందులకు నాకెంతయు ఆనందము గలిగినది. ఇందు పాల్గొనిన యువకబృందమున కంతటికి నా మనఃపూర్వకమైన అభినందనలు. ఇక శ్రీమతి పుష్పలతగారి విషయము ప్రత్యేకముగ చెప్పనవసరములేదు. ఏలయన ఆమె యిప్పటికే నాట్యలోకముయొక్క మెప్పులను మిక్కుటముగ పొంది, కళారంగమున వెలుగొందుచున్న నటీవితంసము. వీరెల్లరి యపార పరిశ్రమచేతను, శ్రీ విశ్వనాథరావుగారి నిర్విరామదర్శకత్వముచేతను యీ ప్రదర్శన మింత మనోహరముగ నెరవేరినది. ఇట్లే రాబోవు నాటకమువారును మరియొక మాసము కృషిచేయబోవుచున్నారు. కావున నే నిప్పుడు మీకు సూచించున దేమనగా, యీ రెండు సంఘములందలి నటీనట కార్యవర్గ సభ్యులకందరికిని ఒకపెద్ద ఛాయాచిత్రమును తీయించి, దానిని మంచి అలంకారములతో ఆ నూతన పురమందిరమునందుంచవలెను. అప్పుడే పురజనులు వారి కృషికి శాశ్వత కృతజ్ఞతను చూపినవారగుదురు. (కరతాళధ్వనులు.)

కళాసముద్రము అపారమైనది. అందును నాట్యకళ తక్కిన కళల కేమాత్రమును తీసిపోవునదికాదు. ఈ కళను గూర్చి యెంతయో చెప్పవలయునని నాకు కోరిక కలదు. కాని దాని కిది సమయము కాదు. అందుచే దానినిప్పుడు తడవక యెల్లరకును మరియొకమారు వందనము లర్పించుచు యింతటితో విరమించుచున్నాను. (కరతాళధ్వనులు. కూర్చుండును.)

విశ్వనాథరావు :- (ప్రవేశించి) అధ్యక్షమహాశయా! సభాసదు లారా! ఇంక యీ నాటకము మరియొక రంగముతో ముగియనున్నది. ఈ ప్రదర్శనమునకు తోడ్పడిన మీ కెల్ల రకు మా కృతజ్ఞతా పూర్వకవందనములు. ఈ కార్యక్రమ మున కంతటికిని మూలకారకులైన యువకుల కందరికిని మా అభినందనలు. మరియు మా యాహ్వానమును త్రోసి పుచ్చక, యీ నాటకమునందు తమ నటనాచాతుర్యమును ప్రదర్శించిన శ్రీమతి పుష్పలతగారికి మా ధన్యవాదములు. ఇంకను యెన్నెన్నో విధముల మాకు తోడ్పడినవారి కెల్ల రకును మా కృతజ్ఞతలు- మన యీ వీరవిహార నాటకము నకు యించుమించు పదివేలరూపాయలు వసూలైనవని చెప్పుటకు యెంతయు సంతసించుచున్నాను. (తెరలో కరతాళధ్వనులు.)

ఈ ప్రదర్శనమునకు యెంతో దయతో విచ్చేసి అధ్య క్షత వహించిన శ్రీ జిల్లాకలెక్టరుగారికిని, కళాద్రష్టలుగ విచ్చేసిన శ్రీ శివరామప్రసాదుగారికిని మా యందరి తరఫున కృతజ్ఞతలు సమర్పించుచు యింతటితో విరమించుచున్నాను. (నిష్క్రమించును.)

(తెర పడును.)

## పంద్రెండవ రంగము

[జైలులో గణేశ్ ఖైదీ దుస్తులతో నిద్రించు చుండును. జబర్ ఖాన్, రంగశాయి అను యిద్దరు పోలీసులు తుపాకులు పట్టుకొని అటుయిటు హారా హుషార్, హారాహుషార్ అని అరచుచు తిరుగుచుందురు. తెరలేచును.]

(పోలీసు ఇన్స్పెక్టరు. ఒకదిక్కునుండి ప్రవేశించును. అప్పుడు పోలీసులిద్దరు ఒకదిక్కు నిలచి సలామ్ చేయుదురు.)

పో. ఇ :— ఊఁ, జాగ్రతగా చూస్తున్నారు గదా? భద్రం. ఇతనిని అతిమెలకువతో చూస్తూఉండాలి. (అని మరియొక దిక్కున నిష్క్రమించును)

(పోలీసులు మరి కొంచెముసేపు పారాహుషార్ అనుచు అటుయిటు తిరుగుదురు. అంతట)

రంగశాయి : ఒరే జబర్ ఖాన్, యిన్స్పెక్టరు పోయినాడులే, యింక కొంచెంసేపు కూర్చోరా. (ఇరువురు జైలుకు రెండు వైపుల బల్లల నానుకొని కూర్చుందురు.) ఖాన్, నాకు కాళ్లు నొస్తుండాయిగాని, ఏదీ ఒకపాట కానియ్.

జబర్ ఖాన్ :— పాట కావాలీ ? అయితే యిను.

పాట.

(హస్ కేవతీమ్,.....వలె)

1. లోకపు తీరెరుగాలీ, జీవా,
ఎరిగిననేగ తమాషా నీవికనైన ఎరుగుము ఓజీవా
నీ వికనైనా ఎఱుగుము ఓ జీవా ॥ లో ॥
2. నీవే రాజురా...నీవే రాతురా
నీవే దొరవురా... నీవే చోరురా
దురాశాయేలరా నీకు యేల చోరీ యేలరా ఖైదీ ॥లో॥
3. పాగర్తోపరాయి వస్తువుల్ విలాసముతో దోతువా।
ఫిరాయించి పోలీసు తడకుమే యున్నాలిట్లు ?
మతిలేదే ! ॥ లో ॥

(ఈ పాట జరుగుచున్నప్పుడు రంగశాయి ఆ నిద్రించు చున్న గణేశ్ వంక చేతితో చూపుచూ తగిన అభినయము చేయుచుండును.)

రంగశాయి :— అరే భాయీ, నిద్రా వత్తాందిగాని, నేను కాసేపు పడుకుంటాను, నీవు మేలుకో.

జబర్ :— నీవు మేలుకో.

రంగ :— అరే నీవు మేలుకో.

జబర్ :— నీవే మేలుకో.

రంగ :— అరే, భాయీ కాసేప్ మేలుకో బే. (అని ఆ బల్లకే ఆనుకుని కూర్చుండియే నిద్రించును.)

జబర్ :— (ఇతడును తనబల్ల కానుకుని కూర్చుండియే నిద్రించును.)

(అంతట గణేశ్ కండ్లు నులుముకొనుచు మెల్లగలేచి అటుయిటు తిరుగుచు, చెదరిన జుట్టుతో, మొలచిన గడ్డముతో, తగిన దుఃఖపు అభినయముతో)

గణేశ్ :— (తనలో) అక్కటా! ఇప్పటి నా స్థితి యెంత ఘోరముగ నున్నది! నేను చేసిన పాపమునకు ఫలితము వెంటనే తగిలి నన్ని కడసారి ఖైదీనిగా చేసెనుగదా! నా జీవితమంతయు ఘోరమగు తలవంపులపాలు చేసెనుగదా! నిజముగ జీవులు చేసిన పాపములకు ఫలము ననుభవింపక తప్పదనుటకు నేనే ప్రబల ప్రమాణము! తేకున్న నాకేమి? ఈ దుర్భర కారాగారవాసమేమి!

మిత్రులలో కెల్ల పరమమిత్రుడగు ఆ ప్రకాశ్ యెంత

హెచ్చరించుచుండినను లెక్కసేయక యీ పాడు చీట్లపేక కూప
ములోపడి కొట్టుకొనసాగితిని ! ఎచ్చటెచ్చట దొరికిన ధనము
నెల్ల తెచ్చి, దానికై బలిచేయుచు, వట్టిచేతులతో నింటికి
పోవుచుంటిని ! తుదకు దానికొఱకై పరులయింటిలోని చేతి
గడియారమును దొంగిలించుటకై నను పాల్పడితిని.

ఛీ ! ఆ దినము నేను ఆ పోలీసు అధికారి యింటికేల
పోవలెను ! ఒకవేళ నేనుపోయినను, ఆ యింటి యజమానుడు
ఆ బంగారు గడియారమును గోడకేల వేసియుంచవలెను ! అది
నా పాపిష్టి కంటయేల పడవలెను ! ఒకవేళ నా కంటపడినను
విద్యావంతుడనగు నాకట్టి దుర్బుద్ధి యేల కలుగవలెను ! ఎవ
రును అచ్చట లేకుండుటచూచి మెల్లగ ఆ దొంగతనము చేసి
నందులకు ధర్మదేవత నన్ను వెంటనే శిక్షకు బద్ధుని చేసినది.

ప్రకాశ్ మున్నగువారు నాటకము వేసినపుడు నేను
వారిని బహిరంగముగ విమర్శించెదను కదాయని హేళనచేయుచుం
టిని. కాని ఆ హేళన ఫలమోయన్నట్లు, నేనా నాటకమునైన
చూడకుండుటకు యీదుస్సహాకారగారము కలిగినది. వారచ్చట
పురాభివృద్ధికై పాటుపడి ధన్యత నొందుచుండ, నేనిచ్చట
పేకాట పెనుభూతమువలన చౌర్యముచేసి, క్రుంగి కుమిలిపోవు
చున్నాను ?

నేను మొదటినుండి ఆ ప్రకాశ్ సత్కార్యములుచూచి
అసూయాపడుచుండుట కిది ఫలితము. వారు చేయుచున్న
హితోపదేశముల పెడచెవినిబెట్టి యథేచ్ఛగ సంచరించినందుల
కిది ఫలితము. కుత్సితబుద్ధితో ఆ కేశవయ్యకు నూరిపోయుచుంచి

నాటకసంఘమున పెద్దతుపాను రేగించినందుల కిది ఫలితము. ఏ నాటకమును పాడుచేయుటకై నే నంతగా కుట్రచేసి ఆ కేశ వయ్యను పురికొల్పితినో ఆ నాటకమునుగాని, కనీసము ఆ రెండవ నాటకమునుగాని చూచుటకు వీలులేకుండునట్లు ఆ భగవానుడు నాకు యీ శిక్ష విధించినాడు కదా! లోకములో పరులను చూచి యెన్నడును అసూయపడరాదు. పాడు చీట్లపేకవంటి దుర్వ్యసనములకు లోబడి నీచకార్యములకు పాల్పడరాదు! ఈ గుణ పాఠమునకు నేనే ప్రబలదృష్టాంతము. నేనే ఘోర ప్రమాణము. హా! దైవమా! నన్నిట్లు చేసితివి! (అని కూల బడి అతివిచారముతో తలవంచుకొని యుండును. తెరపడును.)

# పదుమూడవ రంగము

[పురమందిరమున నూతన భవనము. అధ్యక్షస్థానములో మంత్రిగారు కూర్చుండి యుందురు. ఆయనకు కుడివైపు ప్రక్కవరుసలో జిల్లాకలెక్టరు, విశ్వనాథరావు కూర్చుండియుందురు. ఎడమ వరుసలో ఆపుర పంచాయతీ అధ్యక్షుడగు శ్రీహరిరావు, భుజంగరావు కూర్చుండి యుందురు. అందరి యెదుట బల్లలపై పూలమాలలుండును. తెరలేచును.]

మంత్రిగారు :- (లేచి) మహాజనులారా! మీ సిరిపురములో యీ పురమందిర నూతనభవనమునకు ప్రారంభోత్సవము సలుపు యీ సందర్భమున నన్ను అగ్రాసనాధిపతిగ ఆహ్వానించి, గౌర వించినందులకు మీకు నేనెంతయు కృతజ్ఞుడను. ఈ భవన నిర్మాణ మహాకార్యమున తోడ్పడిన పరోపకారపరాయణుల నందరిని మనసార అభినందించుచు, వారు దేశమునకు మార్గ

దర్శకులై రని చెప్పుటకు సంతసించుచున్నాను.

అయితే మరొక్కమాట యీ సందర్భమున నేను ముఖ్యముగ చెప్పవలయును. అదేమనిన, మీరెల్లరు యెంత పురాభిమానముతోడను, ఐక్యభావముతోడను యీ భవనమును నిర్మించిరో, అంత యుత్సాహ సామరస్యములతోడనే, యీ భవనమును ప్రతిదినమును పెక్కు సత్కార్యముల కుప యోగించు నిమిత్తము ప్రయత్నము చేయవలెను. సద్విని యోగములేని పురభవనము లెన్నియుండిన నేమి ప్రయోజనము కలుగును ? కావున మీరు యీ భవనమునకు వీలైనంత త్వరలో ఒక కార్యవర్గము నేర్పరచి, వారిద్వారా దీనిలో ఒక చక్కని పఠనమందిరమును, అంతకన్నను నిండైన పుస్తకభాండా గారమును, స్థాపింపవలయును. విజ్ఞానదాయకములు, వినోద కరములు అగు ఉపన్యాసములకును, కళాప్రదర్శనములకును, ఉపకార నాటకప్రదర్శనములకును, సత్కార్యసమావేశము లకును, యీ భవనమున స్థానమొసంగవలయును. అంతే కాక యిచ్చట ఒక మంచి ఆటలసంఘమునుకూడ యేర్పాటు చేయ వలయును. అప్పుడే మీరెల్లరు యెన్నో శ్రమలకోర్చి గావిం చిన కృషి సార్థకముకాగలదు. అప్పుడే మీయెల్లర పురభి మానము ప్రశంసనీయము కాగలదు. అప్పుడు మీ పురమంది రము ఫలప్రదము కాగలదు. సభ్యులందరికిని నా ధన్య వాదములు. జై హింద్. (కూర్చుండును. తెరలోను రంగము పైనను కరతాళధ్వనులు.)

శ్రీహరిరావు :- (లేచి) శ్రీ శ్రీ గౌరవనీయులైన మంత్రి

గారు యెన్నో పనులున్నను, మన పురమునకు అత్యంతాదర భావముతో విచ్చేసి, మన పురభవన ప్రారంభోత్సవమునకు అగ్రాసనాధిపత్యము వహించి, మనకెన్నో అమూల్యములగు ఉపదేశముల మూలమునను, సహాయముల మూలమునను, మహోపకారము గావించినందులకు, వారికి మన పురజనుల తరపున హృదయపూర్వకమగు వందన పరంపర లర్పించుచు, యింతటితో విరమించుచున్నాను. జాతీయగీతము పూర్తియైన పిమ్మట సభ ముగియును. (కూర్చుండును. కరతాళధ్వనులు)

(అంతట మోహన్ ప్రవేశించి మంత్రిగారికి కుడిపై పున నిలచును. అందరు నిలచియుందురు.)

కల్యాణి—రూపకం

ప॥ మాతా నీ సుతులమమ్మ మమ్ము బ్రోవుమా, దేశ
మాతా నీ సుతులమమ్మ మమ్ము బ్రోవుమా !

అ. ప॥ గీతాకుసుమాళిచేత చేతులార పూజ చేతుము ॥మా॥

చ॥ జాతివర్ణద్వేషములను సర్వము విడనాడి నీదు
చేతము రంజిల్లునటుల నీతితోడను
మా తనువుల నీ సేవకు ప్రీతితోడ ధారవోతుము ॥మా॥
పక్షభావముల నెల్లను వదలి యైక్యహృదయముతో
అక్షయ తేజమున నిన్ను అనుకరించుచు
దీక్షబూని నీ ఘనతను దేశదేశములును పొగడ ॥ మా ॥
జయము జయము దేశమాత! జయము నీకు పూతచరిత!
జయము బహుళసుత సమేత ! జయము శ్రీయుతా
జయము [illegible] జయము జగము నిన్ను
గొలుచుగాత ! ॥ మా ॥



సమాప్తము.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| **24** | **23** | మనుమరాలు | కుమార్తె |
| **46** | **13** | తాతా | నాన్నా |
| 53 | 14 | గోపాల్: ఏమారు.. | గణేశ్: ఏమారు.. |
| **56** | 8 | తమ్ముడు | కుమారుడు |
| **61** | **4** | **15** రోజుల | **3** నెలల |
| **61** | **4** | మాట? | మాట. |
| **72** | 10 | నిలచును | నిలచి పాడును. |

విద్వాన్ చిట్టా రామకృష్ణరావు బి. ఎ., బి. ఇడి., గారి

# గ్రంథములు.

1. శ్రీకృష్ణదేవరాయలు ... నాటకము
2. నిర్యోష్ఠ్య ... డిటో
3. ఫలదమందిరం ... డిటో
4. నాటికాగుచ్ఛము (మొదటిభాగము) డిటో
5. డిటో (రెండవభాగము) డిటో
6. నిత్యకథ ... వచనము
7. కథానిధి (మొదటిభాగము) డిటో
8. జ్యోతిర్మాల ... ... డిటో
9. భాగవత విమర్శనము ... డిటో
10. త్యాగరాజు భక్తితత్వము ... డిటో
11. ఆంధ్ర సాహిత్య చరిత్రము ... డిటో
12. ప్రబంధ పాత్రలు ... డిటో
13. కాళిదాసు కవిత ... డిటో
14. శ్రీకృష్ణుడు ... డిటో
15. శ్రీదేవీ మాహాత్మ్యము ... డిటో
16. ప్రేమ జ్యోతి ... పద్యకావ్యము
17. అశ్రుమాల ... డిటో
18. సంఘము ... గద్యపద్యాత్మకము
19. గీతాసుధ గద్యపద్య గేయాత్మకము
20. బాపూజీ ... డిటో
21. రుద్రమదేవి ... గేయకథ
22. ఇష్టాగోష్ఠి పద్య గేయాత్మకము.